పార్లే

ఇప్పుడు పార్లే పాపిన్స్ మజా సాగేను ఆగకుండా అలా...
ఇక ప్యాకెట్ యింతలో అయిపోతే మాత్రం ఏం యిలా



పార్లే పాపిన్స్ ర్యాపర్లు పంపించండి, ఉర్రూతలూగించే కానుకలు పొందండి.

**ఉచితం :** పార్లే పాపిన్స్ 20 ర్యాపర్లు పంపినప్పుడు పరిహాసం చిలికే పజిల్ కిట్. పార్లే పాపిన్స్ 10 ర్యాపర్లు పంపినప్పుడు ఫన్ ప్యాడ్ మరియు జంగిల్ బుక్ స్టికర్. పార్లే పాపిన్స్ 4 ర్యాపర్లు పంపినప్పుడు జంగిల్ బుక్ స్టికర్.

*పార్లే పాపిన్స్ యీ కానుక లేకుండా కూడా దొరుకుతాయి.




ఇప్పుడు పార్లే యొక్క కొత్త పళ్ళ రుచులలో.

త్వరపడండి మరి,
ఉన్న కానుకలు మహా తక్కువ.

పోస్టేజ్ స్టాంపులున్న కవరుపై మీ పేరూ, అడ్రసూ వ్రాసి, దాంతోబాటు పార్లే పాపిన్స్ ర్యాపర్లతోబాటు యీ అడ్రసుకు పంపించండి : పాపిన్స్ పాయింట్, పి.బి. బాక్స్-907, బొంబాయి-400 057.

ఫ్రూట్ జ్యూస్ లేదా పల్ప్ రహితంగా,
అదనపు ఫ్లేవర్స్ సహితంగా.

everest/94/PP/186-tl

మీరు చదివారా?

# వనిత

## మే 1995 సంచిక!

## ప్రగతి - వనిత

## వినియోగదార్ల కథల పోటీలో పాల్గొనండి!

## రూ. 2000/- బహుమతులు గెలుపొందండి!

వినియోగదార్ల హక్కుల పరిరక్షణకై విశేష కృషిచేస్తున్న - ప్రగతి కన్స్యూమర్ సొసైటీ, హైద్రాబాదు - వనిత సంయుక్తంగా నిర్వహిస్తున్న ఈ కథలపోటీ - ఇవాళ సామాన్య పౌరుల నుంచి 'అసమాన్య' పౌరుల వరకు అందరూ ఎదుర్కొంటున్న వినియోగదార్ల సమస్యల గురించి ఒక అవగాహన పెంపొందించుకోడానికే. కాబట్టి కలం పట్టండి... మీ సమస్యల చుట్టూ ఈ నియమాలు చదివి, కథ అల్లండి! ఈ బహుమతులు గెలుచుకోండి!!

| | | |
|---|---|---|
| **మొదటి బహుమతి** | - | **రూ. 750/-** |
| **రెండవ బహుమతి** | - | **రూ. 500/-** |
| **మూడవ బహుమతి** | - | **రూ. 300/-** |
| **నాల్గవ బహుమతి** | - | **రూ. 200/-** |
| **రెండు ప్రత్యేక బహుమతులు** | - | **రూ. 125/-** |

నిబంధనలు :

* మీ రచనకు కథావస్తువు సైదు పిన్ను దగ్గర్నుంచి విమాన ప్రయాణం దాకా ఏదైనా కావచ్చు. వినియోగదార్లపై జరిగే చిన్న, పెద్ద మోసాలు, అలా జరగకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు, జరిగితే తీసుకోవలసిన చర్యల గురించి సూచనలు మీ రచనలో, కథా రూపంలో చోటుచేసుకోవాలి.
* మరీ సీరియస్‌గానే సాగాలని లేదు. వ్యంగ్యంగా, హాస్యయుతంగా రచన సాగినా పర్వాలేదు కానీ పై అంశాన్ని గుర్తుంచుకోండి.
* కథ ఆరు పేజీలకు (ఫుల్‌స్కేప్ సైజులో) మించరాదు.
* తిరుగు టపా వుండదు కాబట్టి, స్టాంపులు, కవర్లు జతపరచనవసరం లేదు.
* ఈ పోటీలో ప్రగతి, వనిత సిబ్బందులు, వారి బంధువులు పాల్గొనరాదు.
* ఈ పోటీలో పురుషులూ పాల్గొనవచ్చు.
* కథను, వినియోగదార్ల కథల పోటీకి అని కవర్‌పై రాసి, వనిత, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026 చిరునామాకి పంపాలి

**కథలు పంపవలసిన చివరి తేదీ : మే 31, 1995**

**ఫలితాలు : జన్మదిన (జూలై '95) సంచికలో!**

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!






SUPER
RUBBER









# చందమామ

మే 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి




## పిల్లల ఆరోగ్యం

ఇటీవల యూనిసెఫ్ జరిపిన ఒక సర్వేలో కొన్ని భయానకమైన విషయాలు బయటపడ్డాయి. మన దేశంలో 44 శాతం పిల్లలకు సరైన పౌష్టికాహారం లభించడంలేదు. వాళ్ళల్లో 19 శాతం పిల్లల పరిస్థితి మరీ చావు బతుకుల మధ్య ఉన్నది. 22,00,000 మంది పిల్లలు థైరాయిడ్ లోపంతోనూ, 66,00,000 మంది పిల్లలు కండరాల బలహీనత వల్ల సరిగ్గా కదలలేకుండా ఉన్నారు. దీనికి కారణం ఆహారంలో ఇనుముశక్తిలోపించడమే. యేటా 9,000 మంది శిశువులు నెలలు నిండక ముందే పుడుతున్నారు. విటమిను 'ఎ' లోపం వల్ల యేటా 60,000 మంది పిల్లలు కంటిచూపు కోల్పోతున్నారు. 25 కోట్ల మందికి అంటే, జనాభాలో 30 శాతం మందికి పౌష్టికాహారం లభించడం లేదు. అంటే వీరందరూ దారిద్ర్య రేఖకు దిగువనున్న వారే!

పిల్లలకు పౌష్టికాహారం ఇచ్చే శక్తి తల్లిదండ్రులకు లేనప్పుడు, ప్రభుత్వమే ఆ బాధ్యతను చేపట్టాలి. ఈ విషయాన్ని గుర్తించే మనదేశంలో ఇంచుమించు అన్ని రాష్ట్రాలూ ప్రాథమిక పాఠశాలలలో చదివే పేదపిల్లలకు మధ్యాహ్న భోజన పథకాలను అమలుచేస్తున్నాయి. అయితే, బడికి వెళ్ళలేని పిల్లల పరిస్థితిని గురించీ, బడిమానేసిన వాళ్ళ పరిస్థితిని గురించి ఇక్కడ ఆలోచించాలి.

తల్లితండ్రుల ఆర్థిక స్థితిని పెంచడానికీ; పాలూ, పప్పులూ వంటి ఆహార పదార్థాల ధరలు వాళ్ళకు అందుబాటులో ఉండేలా చేయడానికీ ప్రభుత్వం కృషి చేయాలి. అంతేకాదు; సక్రమమైన పరిశోధనల ద్వారా పిల్లల ఆరోగ్య పరిరక్షణ విషయంలో ప్రభుత్వం జాగ్రత్త తీసుకోవాలి. వ్యాధులు వచ్చాక అవస్థ పడడంకంటే అవి రాకుండా జాగ్రత్త పడడం శ్రేయస్కరం. అప్పుడే అందరికీ ఆరోగ్యం అన్న లక్ష్యాన్ని సాధించగలుగుతాము.


సంపుటి : 97 మే '95 సంచిక: 5

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00




వార్తలు - విశేషాలు :

# ఐర్లాండులో శాంతికోసం

ఐర్లాండు ప్రజలకు సెయింట్ ప్యాట్రిక్స్‌డే చాలా ముఖ్యమైన రోజు. క్రీ॥పూ॥ 4వ శతాబ్దంలో అది సెల్ట్స్ కాలనీగా ఉండేది. ఆ తరవాత 900 సంవత్సరాలకు అక్కడ క్రైస్తవమతం వ్యాపించింది. ఇంగ్లాండులో పుట్టి, ఓడదొంగల వాతబడిన ప్యాట్రిక్, ఉత్తరోత్తరా క్రైస్తవ మిషనరీగా శిక్షణపొంది క్రీ.శ.450 ప్రాంతంలో ఐర్లాండు చేరుకుని, అక్కడ క్రైస్తవ మతవ్యాప్తికి పాటుపడ్డాడు. ఆయనను ఐరిష్ ప్రజలు ఎంతగానో గౌరవిస్తారు. మార్చ్ 17వ తేదీ భక్తి శ్రద్ధలతో ఆయనను స్మరించుకుంటారు.

ఈయేడు మార్చ్ 17వ తేదీ వాషింగ్టన్‌లోని 'వైట్ హౌస్' ఇరువురు ఐరిష్ నాయకులకు అభినందన ఏర్పాటు చేసింది. ఐరిష్ ప్రధానమంత్రి జాన్ బ్రూటన్, సిన్‌ఫీన్ నాయకుడు జెర్రీ ఆడమ్స్ ఈ అభినందన సభలో పాల్గొన్నారు. గత 25 సంవత్సరాలుగా బ్రిటన్‌తో యుద్ధం సాగిస్తున్న ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీ (ఐ.ఆర్.ఏ) రాజకీయ ప్రతినిధిగా జెర్రీఆడమ్స్ భావించబడడం వల్ల, ఆయనను అమెరికా ఆహ్వానించడం బ్రిటన్‌కు నచ్చలేదు. అయితే, ఐ.ఆర్.ఏ. యుద్ధ విరమణను ప్రకటించి, గత సెప్టెంబర్ నెల నుంచి బ్రిటన్‌తో సుస్థిరశాంతి కోసం మంతనాలు జరుపుతున్నది కాబట్టి, దాని రాజకీయ ప్రతినిధిని ఆహ్వానించడంలో తప్పులేదని అమెరికా భావిస్తున్నది.

ఐర్లాండు — యునైటెడ్ కింగ్‌డమ్ (గ్రేట్ బ్రిటన్, స్కాంట్‌ల్యాండ్, వేల్స్)తో కలిసినది నార్తర్న్ ఐర్లాండు గానూ; రిపబ్లిక్ ఆఫ్ ఐర్లాండ్ అనే దక్షిణ ప్రాంతంగానూ విభజించబడి ఉన్నది. అంతవరకు గ్రేట్‌బ్రిటన్ అధికారంలో ఉన్న ఐర్లాండులో 1916వ సం॥లో తిరుగుబాటు జరిగింది. 1921వ సం॥లో దక్షిణ ప్రాంతం 'ఐరిష్ ఫ్రీ స్టేట్'గా విడిపోయింది. అది బ్రిటిష్ కామన్వెల్త్‌ను వదిలి 1949వ సం॥లో రిపబ్లిక్‌ఆఫ్ ఐర్లాండ్ అయింది. 1916వ సం॥లో తిరుగుబాటులో పాల్గొని జైలు పాలయిన ఈమన్ దీ వలేరా, సిన్‌ఫీన్ జాతీయ పార్టీ నాయకుడయ్యాడు. ఆయన 1917వ సం॥లో బ్రిటన్‌తో శాంతిప్రయత్నాలు చేశాడుగాని, అవి విజయవంతం కాలేదు. ఆయన 1932వ సం॥లో ప్రధాన మంత్రి అయి, 1959వ సం॥లో అధ్యక్షుడయ్యాడు.

ఉత్తర ఐర్లాండులో ప్రొటెస్టెంట్లు అధిక సంఖ్యాకులు. వాళ్ళు బ్రిటన్‌తో ఉన్న సంబంధాలను బలపరిచారు. అల్పసంఖ్యాకులయిన రోమన్ కేథలిక్కులు వివక్షతకు లోనవుతున్నామని భావించి, ఐరిష్ రిపబ్లిక్‌తో కలిసి పోవాలనుకున్నారు. 1969వ సం॥లో ఇరు పక్షాల మధ్య హింసాత్మక ఘర్షణలు ప్రారంభమయ్యాయి. ఐర్లాండు సమైక్యత కోసం ఏర్పడిన ఐ.ఆర్.ఏ. కార్యరంగంలోకి దిగడంతో బ్రిటిష్ సేనలతో ఘర్షణలు మరింత పెచ్చరిల్లాయి. అది 25 సంవత్సరాలు సాగాయి. 3,000 మంది మరణించారు. 1994 వసం॥ ఆగస్టులో ఐ.ఆర్.ఏ. గెరిల్లా యుద్ధ విరమణకు పిలుపునిచ్చింది. అప్పటి నుంచి సిన్‌ఫీన్ రాజకీయ పరిష్కారం కోసం పోరాడుతున్నది.

అమెరికా ఒకప్పుడు సిన్‌ఫీన్‌ను తీవ్రవాదసంస్థగా పరిగణించి దానితో సంబంధాలు నిషేధించింది కూడా. అయితే, ఐ.ఆర్.ఏ. యుద్ధవిరమణ ప్రకటించిన తరవాత తన ధోరణిని మార్చుకున్నది. ఐర్లాండు, ఇంగ్లాండుల మధ్య శాంతి ఏర్పరచడానికి అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ ఆశిస్తున్నాడు. అలాంటప్పుడు ముఖ్యమైన పర్వదినం సందర్భంగా ఇరుపక్షాల నాయకులను సమావేశ పరచడంకన్నా మంచిమార్గం ఉండదు కదా!



# పొల్లుమాట

సుశాంతుడు, సుమనుడు ఒకే గురుకులంలో చదువుకున్నారు. గురువు, సుశాంతుణ్ణి వ్యాపారంచేయమన్నాడు. సుమనుణ్ణి పాండిత్యంలో మరింతగా కృషిచేయమన్నాడు.

ఆప్రకారం సుమనుడు స్వగ్రామానికి వెళ్ళి సకల శాస్త్రాలనూ ఆకళింపు చేసుకోసాగాడు. సుశాంతుడు పట్నం వెళ్ళి వ్యాపారం ప్రారంభించి, అచిరకాలంలోనే లక్షలార్జించాడు. డబ్బు చేరడం వల్ల అతడి చుట్టూ చుట్టపక్కాలు, స్నేహితులు కూడా ఎక్కువగా చేరారు. చాలా మంది అతణ్ణి అదే పనిగా పొగుడుతూండేవారు.

అలా కొంతకాలం గడిచాక, ఒకరోజున సుశాంతుడింట్లో సాధువొకడు భోజనం చేసి, "నీకేం కావాలో కోరుకో, నాయనా!" అన్నాడు.

సుశాంతుడు నవ్వి, "స్వామీ! నాక్కావలసినవన్నీ నేనే సంపాదించుకున్నాను. నాకు లేని దివ్వగల శక్తి మీకున్నదని నేననుకోను. తమరికేమైనా కోరిక వుంటే చెప్పండి. నేనే తీర్చగలను," అన్నాడు.

దానికి సాధువు నవ్వి, "అన్నీ వున్నాయని అనుకోవడం అజ్ఞానం. నువ్వు జ్ఞానాన్ని సంపాదించుకోవాలన్నదే నా కోరిక," అన్నాడు.

"నేను సంపాదించినదంతా నా జ్ఞానం వల్లనే వచ్చింది. నన్ను మీరు జ్ఞానం సంపాదించమనడం విచిత్రంగా వుంది," అన్నాడు సుశాంతుడు.

"జ్ఞానమున్నవారు పొల్లుమాట అనరు. నువ్వు అజ్ఞానివి కాబట్టే నా కోరికను తీర్చగలనని అన్నావు. కానీ నేనెలాంటి కోరిక కోరుతానో ఊహించనైనా ఊహించలేవు. నా కోరికను మానవ మాత్రులెవ్వరూ తీర్చలేరని గ్రహించేదాకా, నువ్వు జ్ఞానం సంపాదించక తప్పదు," అన్నాడు సాధువు.

సుశాంతుడికి కోపం వచ్చింది. అది పైకి కనబడనీయకుండా, "పొల్లుమాట అనని

"వసుంధర"

జ్ఞానిని గురించి తమకు తెలిస్తే చెప్పండి. వెళ్ళి జ్ఞానం సంపాయించుకుని వస్తాను," అన్నాడు వెటకారంగా.

"అయితే శకటాపురం వెళ్ళు. అక్కడ సుమనుడనే జ్ఞాని వున్నాడు. ఆయనను సేవించుకో," అని వెళ్ళిపోయాడు సాధువు.

సుమనుడి పేరు వినగానే తృళ్ళిపడ్డాడు సుశాంతుడు. వాడుకానీ గురుకులంలోని తన స్నేహితుడు కాదు కదా అని అతడికి అనుమానం వచ్చింది. ఎందుకంటే – సుమనుడు శకటాపురంలోనే స్థిరపడ్డాడు.

గురుకులంలో చదివిన వారందరిలోనూ, తనే గొప్పవాడినయ్యానని సుశాంతుడు ఇన్నాళ్ళూ నమ్ముతూ వచ్చాడు. సాధువు మాటలు వినగానే సుశాంతుడిలో అనుమానంతోపాటు,అసూయకూడా పుట్టి, వెంటనే శకటాపురానికి ప్రయాణమయ్యాడు.

తానెంత గొప్పగా జీవిస్తున్నాడో శకటాపురం వాళ్ళకు తెలియాలని, సుశాంతుడు చాలా ఆర్భాటంగా బయల్దేరాడు. ముత్యాలపల్లకీలో దాసదాసీ జనం వెంటరాగా, అతడు నాలుగు రోజులు ప్రయాణం చేసి శకటాపురం చేరుకున్నాడు.

శకటాపురం ఊరు చాలా పెద్దది. అక్కడ సుమనుణ్ణి గురించి వాకబు చేస్తే, ఎవరూ అతడి ఇల్లు ఫలానా చోట అని చెప్పలేక పోయారు. అనుకోకుండా సుమనుడి శిష్యుడొకడు తటస్థపడి విషయం తెలుసుకుని,



సుశాంతుణ్ణి తన గురువుగారింటికి తీసుకు వెళ్ళాడు.

సుమనుడి ఇల్లు పరిశుభ్రంగా వున్నప్పటికీ చిన్న పెంకుటిల్లు మాత్రమే. అదిచూసి సుశాంతుడు మనసులో ఎంతో సంతోషించి, 'వీడు నాకంటే గొప్పవాడు కాలేదు,' అనుకున్నాడు. కారణం – అతడికి పట్నంలో ఏడంతస్థుల మేడలే మూడున్నాయి.

సుశాంతుడు వెళ్ళిన సమయంలో, సుమనుడు ఊళ్ళో లేడు. జమీందారెవరో కబురు చేస్తే పండిత సభలకు వెళ్ళాడు. రేపటికి తిరిగి వస్తాడు. ఈ విషయం చెప్పి సుమనుడి భార్య గీత, సుశాంతుణ్ణి సాదరంగా ఆహ్వానించింది.



ఆ ఇంట్లో సుమనుడి శిష్యులు నలుగురున్నారు. సుశాంతుడు వాళ్ళను పలకరించి, సుమనుడి వద్ద డబ్బు ఏమాత్రం వున్నదని ఆరా తీశాడు. వాళ్ళు తల అడ్డంగా తాటించి, "మాకు చదువు బాగా వస్తుందని చెప్పి, గురువుగారే మమ్మల్ని పోషిస్తూ చదువు చెబుతున్నారు. ఆయనవద్ద డబ్బెంత వున్నదీమాకు తెలియదు," అని చెప్పారు.

సుశాంతుడితో పాటు అక్కడకు మొత్తం ఇరవై మంది పరివారం వచ్చారు. అందరికీ గీత పంచభక్ష్య పరమాన్నాలతో విందు చేసింది.

సుశాంతుడా సాయంత్రం శిష్యులను పిలిచి, "మీ గురువు నా స్నేహితుడు. చూడాలనిపించి వచ్చాను. రోజూ ఈనాటిలా భోజనాలు పెడితే, మీ గురువు అప్పులపాలవుతాడు. అది నాకిష్టం లేదు. ఏ దుకాణంలో సరుకులు మీరు అరువు తెస్తున్నదీ నాకు చెప్పండి. మొత్తం బాకీ నేను తీర్చేస్తాను," అని చెప్పాడు.

"అవన్నీ మాకు తెలియవు. వచ్చాక గురువుగారికి చెప్పండి," అన్నారు శిష్యులు.

మర్నాటికల్లా సుమనుడు పండిత సభల నుంచి తిరిగి వచ్చాడు. అతను సుశాంతుణ్ణి చూసి ఆనందంతో కౌగిలించుకుని విశేషాలడిగి తెలుసుకున్నాడు. సుశాంతుడు గొప్ప సంపన్నుడయ్యాడని ఎంతో సంతోషించాడు.

సుశాంతుడు మాత్రం అసంతృప్తిగా, "నా గొప్పతనం నాకు సంతోషాన్నివ్వడం లేదు. నువ్వు కూడా నాస్థాయికి చేరుకుంటే, అప్పుడే నాకు ఆనందం కలుగుతుంది. నీ జీవిత విధానం నాకు నచ్చలేదు. ఇక్కడ ఊరూ పేరూ లేకుండా కాలం గడుపుతున్నావు. ఇంత చిన్న ఇంట్లో వుంటూ, భార్యకు నగలైనా కొనక – నలుగురు శిష్యులను తిండి పెట్టి పోషించడానికి పూనుకున్న నువ్వు జ్ఞానివా, మూర్ఖుడివా? నా మాట విని నాతో మా ఊరు వచ్చెయ్యి. నీకు వ్యాపారం నేర్పుతాను," అన్నాడు.

నిజానికి సుశాంతుడికి, సుమనుడి పట్ల జాలి లేదు. తన గొప్పతనాన్ని ప్రకటించుకోవడానికే అతనా మాటలన్నాడు. అయితే

సుమనుడు మాత్రం మిత్రుడి మాటలు శ్రద్ధగా విని, "నేనీ ఊరు విడిచి రావాలంటే ముందుగా అప్పులన్నీ తీర్చాలి. లేకుంటే అప్పులవాళ్ళు నన్ను కదలనివ్వరు," అన్నాడు.

వాళ్ళందర్నీ పిలిపించమన్నాడు సుశాంతుడు. శిష్యులు వెళ్ళి వాళ్ళను పిలుచుకు వచ్చారు. వాళ్ళు మొత్తం ఐదుగురు. ఒకడు వడ్డీవ్యాపారి.ఇంకొకడుకిరాణాదుకాణంవాడు. ఒకడు ఇల్లు కట్టిన మేస్త్రీ. ఒకడు తాళపత్రాలమ్మేవాడు. ఇంకొకడు బండివాడు.అందరికీ కలిపి సుమనుడు నాలుగు వేలవరహాల దాకా బాకీ వున్నాడు.

"మీ అందరి బాకీలు నేను తీర్చేస్తాను. మీరు సుమనుణ్ణి విడిచిపెట్టండి," అన్నాడు సుశాంతుడు.

దీనికి అప్పులవాళ్ళు నొచ్చుకుని, "అయ్యా! వీరిమీద మాకు పూర్తి నమ్మకముంది. పాత బాకీతీర్చకుండా కొత్తగా అప్పివ్వగలం. ఊరొదలి వెళ్ళినా, ఏదో రోజున వచ్చి మా బాకీ తీర్చగలరని తెలును. అందుచేత, వీరిని విడిచిపెట్టక పోవడం ప్రసక్తి లేనే లేదు," అన్నారు.

అయినా సరే ఆ బాకీలన్నీ తను తీర్చేస్తానన్నాడు, సుశాంతుడు.

అప్పుడు అప్పులవాళ్ళు సుమనుడితో, "అయ్యా! మా బాకీ తీర్చమని ఏనాడైనా మేము మిమ్మల్ని వత్తిడి చేశామా? అయినా ఇప్పుడు వేరెవరో వచ్చి తీర్చవలసిన అవసరమేముంది? మీరిలాంటి ఏర్పాట్లు ఎందుకు చేస్తున్నారు?" అంటూ బాధపడ్డారు.





"ఆలోచించకుండా నేనెన్నడూ ఏ మాటా చెప్పను. కాబట్టి, నిస్సంకోచంగా అడుగు," అన్నాడు సుమనుడు.

సుశాంతుడికి సాధువు మాటలు గుర్తు కొచ్చాయి. ఆయన సుమనుణ్ణి మహాజ్ఞాని అన్నాడు. జ్ఞానులు పొల్లుమాటలాడరన్నాడు. ఇప్పుడు సుమనుడు పొల్లుమాట ఆడినట్లు ఋజువు చేస్తే, వాడు జ్ఞాని కాదనే అర్థం! సుమనుడిది పొల్లుమాట చేయడం, తన కిప్పుడు చిటికెల మీద పని!

సుశాంతుడు ఇలా ఆలోచించి, "నాకు చాలా డబ్బు వ్యాపారంలో చిక్కుపడిపో యింది. ఉన్నపళంగా ఇరవై లక్షల వర హాలుదొరికితే – ఒక్కసారి రెండు కోట్ల వర హాలు సంపాదించవచ్చు. నువ్వు కోరినది ఇస్తానన్నావు గనక ఇప్పుడు నాకు ఇరవైలక్షలు అప్పుగా ఇవ్వు," అన్నాడు.

ఇదివిని అక్కడున్న వారందరూ దిగ్భ్రాంతు లయ్యారు. సుమనుడు మాత్రం చలించ కుండా, "నేను నీతో ఏకాంతంగా మాట్లాడ తాను – లోపలకు రా!" అన్నాడు.

సుశాంతుడు తల అడ్డంగా ఊపి, "నువ్వు నా ప్రేమానురాగాల్ని అందరి ముందూ పరీక్షించావు. నువ్వు జ్ఞానివి. జ్ఞానులు పొల్లు మాట ఆడరని అంటారు. ఆ విషయం ఇప్పుడు అందరి ముందూ బయటపడితేనే, నాకు సంతోషంగా వుంటుంది," అని పట్టు బట్టాడు.

సుమనుడు వాళ్ళను సముదాయించి, "నా మిత్రుడికి నాపై ఎంతటి ప్రేమానురాగా లున్నాయో నలుగురికీ తెలియడానికి, నేను పెట్టిన పరీక్ష ఇది. నా బాకీలు మరెవరిచేతా తీర్చనివ్వను!" అన్నాడు.

సుశాంతుడాశ్చర్యపడి, "నువ్వు నాకు పరీక్ష పెట్టావా, ఎందుకు?" అని అడిగాడు.

"ఎందుకేమిటి? రాకరాక నా ఇంటికొ చ్చావు. నీకు నిజంగా నాపైన ప్రేమానురాగా లున్నాయని ఋజువైతే, నేను నీకు కోరినది ఇవ్వవద్దా?" అన్నాడు సుమనుడు.

అప్పుడు సుశాంతుడు మరింత ఆశ్చర్య పడి, "నువ్వు నాకు కోరినదిస్తావా? ఆలోచించు కునే చెబుతున్నావా?" అని ప్రశ్నించాడు.

సుమనుడెంత చెప్పినా, సుశాంతుడు పట్టువదలలేదు. చివరకు సుమనుడి శిష్యులు కలగజేసుకుని, "గురువుగారూ! మీ పరువు కంటే మాకి ప్రపంచంలో ఏదీ ముఖ్యం కాదు. మీ మిత్రుడడిగిన ఇరవై లక్షలూ మమ్మల్నితెచ్చి ఇవ్వమన్నారా?" అని అడిగారు.

సుశాంతుడాశ్చర్యపడి, "పూట తిండికి గతిలేని మీరు, నాకు ఇరవై లక్షలు తెచ్చి యిస్తారా?" అన్నాడు.

సుమనుడు నవ్వి, "వాళ్ళు పూట తిండికి గతిలేని వాళ్ళు కారు, కోటీశ్వరుల బిడ్డలు. జ్ఞాన సముపార్జన కోసం నావద్దకు వచ్చారు. డబ్బు మనిషికి కృత్రిమమైన గౌరవాన్ని తెచ్చి పెడుతుంది. అది ఇష్టం లేక వాళ్ళ సంపద విషయం నేనూ, వాళ్ళూ కూడా రహస్యంగా వుంచాం. నా విషయంలోనూ అదే. నేను పండిత సభలకు వెళ్ళినప్పుడు రాజాధిరాజులు, కోటీశ్వరులు మెచ్చి ఇచ్చిన విలువైన మణులు, రత్నాలు, వజ్ర వైడూర్యాలు నా వద్ద చాలా వున్నాయి. ఈ విషయం రహస్యంగా వుంచడానికి నేను సామాన్య జీవనం గడుపుతుంటే, ఈరోజున నీ మూర్ఖపు పట్టుదల వల్ల అందరికీ చెప్పవలసి వచ్చింది. నీ ఇరవై లక్షల వరహాల అవసరాన్ని తీర్చడానికి నావద్ద వున్న ఒక మణిని తెచ్చిస్తే సరిపోతుంది," అంటూ గదిలోకి వెళ్ళి, ఒక మణిని తెచ్చాడు.

సుశాంతుడు మణిని చూసి దిగ్భ్రమ చెంది, "నీ మాట పొల్లుమాట చేయాలనుకున్నాను. కానీ, నాది పొల్లుజీవితమని ఇప్పుడర్థమయింది. ప్రాజ్ఞుడు, పండితుడు తనకున్నది ప్రదర్శించాలనీ, ఆర్భాటంగా జీవించాలనీ అనుకోడు. ఆమాత్రం తెలుసుకోలేక, నిన్ను చిన్నబుచ్చాలని పనిగట్టుకుని ఇంత దూరం వచ్చాను. నన్ను క్షమించి నాకు జ్ఞాన బోధ చేసి పంపించు," అని మిత్రుణ్ణి వేడుకున్నాడు.

సుమనుడు, సుశాంతుడికి కొంతకాలం పాటు ఉపనిషత్తుల సారాన్ని చెప్పి, అతడిలోని అహంకారం పోయేలా చేశాడు. ఆతర్వాత సుశాంతుడు వినయ గుణాన్ని అలవర్చుకుని, డబ్బుతో నిమిత్తం లేని శాశ్వత గౌరవాన్ని అందరినుంచీ పొందాడు.



# తగినకోడలు

పోటుమెరక అనే గ్రామంలో, సక్కుబాయి అనే ధనికురాలుండేది. ఆమె పిసినారితనాన్ని గురించి అందరూ వింతగా చెప్పుకునేవారు. ఇది ఎరిగిన సక్కుబాయి — తనది పిసినారితనం కాదనీ, పొదుపరితనం అనీ అంటూండేది.

ఆమె భర్త చాలాకాలం కిందట చనిపోయాడు. ఒక్కగానొక్క కొడుకు సాంబయ్య అనే వాణ్ణి అతి గారాబంగా పెంచి పెద్ద చేసింది. వాడికి పెళ్ళీడు రాగానే కోడలి కోసం ప్రయత్నాలు ప్రారంభించింది.

సక్కుబాయి ఎలాంటి గడ్డుపిసినారి అయినా, ఆస్తిపరురాలు గనక, తమ పిల్లనిస్తామంటూ చాలా మంది ముందుకు వచ్చారు. అయితే, అలాంటి వాళ్ళతో ఆమె," మీ అమ్మాయికి ఒక పరీక్ష పెడతాను. అందులో నెగ్గితే కోడలిగా చేసుకుంటాను," అనేది.

ఆమె పరీక్షలో చాలామంది ఆడపిల్లలు ఓడిపోయారు.

ఇలా వుండగా, పక్క గ్రామంలో మంచి సంబంధం వున్నదని తెలిసి సక్కుబాయి ఆగ్రామం వెళ్ళి, పిల్లవాళ్ళ ఇంట్లో భోజనం చేసి, పెళ్ళికూతురుతో, "రుక్మిణి అన్న నీపేరు చాలా బాగుందమ్మా! ముందు భోజనం చేసిరా. పరీక్ష సంగతి తర్వాత," అన్నది.

అందుకు రుక్మిణి, "మా ఇంట్లో రోజువారీ ఖర్చుకాకుండా అదనంగా అయ్యే ఖర్చును, ఏదో ఒక రూపంలో భర్తీ చేసుకోవడం అలవాటండి! అందుకని ఈపూట నేను భోజనం చెయ్యను," అన్నది.

ఆ జవాబుతో సక్కుబాయి పరవశించిపోయి, "ఆహాఁ, పొదుపరితనంలో నన్ను మించిన దానివి రుక్మిణీ! నీలాంటి కోడలు దొరకడం, నా అదృష్టం," అన్నది.

— చోడవరపు సత్యప్రకాశరావు






## 8

[భువనసుందరి కారణంగా గ్రీకులు ట్రోయ్ నగరాన్ని ముట్టడించిన పదవ సంవత్సరంలో ఇరుపక్షాలగల గొప్ప యోధులు పలువురు మరణించారు. గ్రీకుపక్షాన మరణించిన వారిలో వజ్రకాయుడు, భూధవుడు మొదలైన వీర ప్రముఖులున్నారు; ట్రోజను ప్రముఖులలో వీర సింహుడు, మోహనుడు మొదలైనవారున్నారు. మోహనుడుపోగానే, భువనసుందరిని, ఆమె కిష్టంలేకుండానే, అరిభయంకరుడు బలవంతంగా పెళ్లాడాడు. ట్రోయ్ నగర పతనానికి పూనుకున్న రూపధరుడికి భువనసుందరీ, ఆమె అత్తగారూ కూడా సహకరించారు.]

ట్రోయ్ పతనానికి కొంత ముందుగానే వర్ధనుడి కుమారుల మధ్య అంతఃకలహాలు బయలుదేరి చాలా తీవ్రంగాపరిణమించాయి.

అది చూసి వర్ధనుడు గ్రీకులతో రాజీపడటానికిరహస్యంగా ఒక యత్నం చేశాడు. ఆయన తన బావమరిది అయిన ప్రత్యామ్నాయుడనే వాణ్ణి రారాజు వద్దకు పంపాడు. ఈ ప్రత్యామ్నాయుడికి అరిభయంకరుడంటే ఏమాత్రమూ పడదు. అందుచేత అతను కేవలం సంధి రాయబారాలు మాట్లాడి తిరిగిపోవటానికి బదులు రూపధరుడితో ఒక కుట్ర పన్నాడు. ట్రోయ్‌రాజసింహాసనమూ, రాజధనంలో సగం వంతూ ప్రత్యామ్నాయుడికి దక్కేటట్టూ, ప్రత్యామ్నాయుడు ట్రోయ్ నగరాన్ని రూపధరుడి చేతులలో పెట్టేటట్టూ ఒడంబడిక జరిగింది. ఈ కుట్ర కొనసాగటానికి ప్రశంసనుడు సహాయం చెయ్యగలడని ప్రత్యామ్నాయుడు రూపధరుడితో అన్నాడు.



ట్రోయ్ నగరంలో గ్రీకులకు సహాయం చేసేవాళ్లున్నారు. ఆ నగరం నుంచి బుద్ధిమతి విగ్రహం దొంగిలించబడింది. ట్రోయ్ పతనానికి అవసరమైన పరిస్థితులన్నీ ఏర్పడ్డాయి. ఇక గ్రీకులు నగరంలోకి ప్రవేశించటమే తరువాయి. ఇందుకుగాను ఒక బ్రహ్మాండమైన కొయ్యగుర్రాన్ని తయారు చేయటానికి గ్రీకులు పూనుకున్నారు.

ఈ గుర్రాన్ని తయారుచేసినవాడు దోర్థండుడనేవాడు. ఇతను గ్రీకుల పక్షాన పోరటానికి ముప్ఫై నౌకలతోసహా వచ్చాడు. ఇతను గొప్ప శిల్పి,మల్లయుద్ధంలోగట్టివాడు కూడా; అయితే చాలా పిరికివాడు. ఇతను కొయ్యగుర్రాన్ని నిర్మించి, దానికి ఒక పక్కన, పైకి తెలియరాకుండా, తలుపు ఒకటి అమర్చాడు. రెండవ పక్క కొయ్యలో, "తమ తిరుగు ప్రయాణం సుఖంగా జరగగలందులకు బుద్ధిమతీదేవికి గ్రీకులు సమర్పించు కానుక," అని చెక్కాడు. గుర్రం కడుపులోనుంచి బయటికి ఒక తాటి నిచ్చెన అమర్చాడు.

తరవాత రూపధరుడు గ్రీకువీరులలో ధైర్యవంతులందరినీ ఈ గుర్రం కడుపులో దాగటానికి ఒప్పించాడు. వీరిలో ప్రతాపుడు, రూపధరుడు, దేవమయుడు మొదలైనవారు సుమారు ముప్ఫైమంది ఉన్నారు. గుర్రాన్ని నిర్మించిన దోర్థండుణ్ణి కూడా ఎక్కించారు. అందరూ ఎక్కిన అనంతరం ఇతను అతి బలవంతం మీద తాను కూడా ఎక్కి, తాటి నిచ్చెన లోపలికి లాగేసుకుని, తలుపుమూసి, బీగం వేసేశాడు.

మిగిలిన కార్యక్రమం రూపధరుడు వేసిన వ్యూహం ప్రకారం జరిగిపోయింది.

ఆరాత్రి చీకటిపడగానే గ్రీకులు తమ శిబిరానికి నిప్పు పెట్టేశారు. గుర్రం కడుపులో దాగిన యోధులు మినహాగా మిగిలిన గ్రీకులందరూ రారాజు వెంట పడవలలో ఎక్కి బయలుదేరి, టెనెడోస్‌దీవికి కొంతదూరాన లంకల మధ్య లంగరువేశారు. అయితే ఒక్క గ్రీకు యోధుడు మాత్రం కొయ్యగుర్రంతో బాటు ట్రోయ్‌తీరానకావాలనేఉండిపోయాడు. ఇలా ఉండిపోయినవాడు రూపధరుడికి దాయాది. అతనిపేరు చౌర్యనాధుడు. గ్రీకు

నౌకలుతిరిగిరావలసినసమయంవచ్చినప్పుడు జ్యోతి వెలిగించి సంకేతంఇవ్వటంఅతనిపని.

మర్నాడు తెల్లవారింది. గ్రీకు శిబిరంలో పరిస్థితులు చూడవచ్చిన ట్రోజను వేగుల వాళ్లు నగరానికి తిరిగివచ్చి, గ్రీకు శిబిరమంతా బూడిద అయి ఉన్నదనీ, సముద్రతీరాన ఒక బ్రహ్మాండమైన కొయ్యగుర్రాన్ని వదిలిపెట్టి గ్రీకులంతా వెళ్లిపోయారనీ చెప్పారు. ఈమాట వినగానే వర్ధనుడు తన కుమారులనూ, ఇతరులనూ వెంట బెట్టుకునిగుర్రాన్నిచూడవచ్చాడు.

అందరూ గుర్రంకేసి ఆశ్చర్యంగా చూస్తున్న సమయంలో ఒకరు, "ఇదిబుద్ధిమతికి కానుక అయినప్పుడు మనం దీనిని నగరంలోకి తీసుకుపోయి బుద్ధిమతి ఆలయం ముందు ఎందుకు ఉంచగూడదూ?" అన్నారు.

మరొకరు, "ఈ యుద్ధంలో బుద్ధిమతిమన పక్షానకన్న శత్రువులపక్షానఅధికంగా సహాయం చేసింది. మనం దీన్ని ఇప్పుడే తగలబెట్టేద్దాం లేదా, దీనిని విరగగొట్టి, దీని కడుపులో ఏమున్నదో చూద్దాం!" అన్నారు.

ఈ మాటలకు వర్ధనుడు సుతరామూ ఒప్పుకోలేదు. "దేవతకు కానుకగా వదిలిన వస్తువును నాశనం చెయ్యటం చాలా పాపం. మనం ఈ గుర్రాన్ని చక్రాలమీద నగరంలోకి చేర్చుదాం!" అన్నాడాయన.

ఆ ప్రకారమే ట్రోజనులు కొయ్యగుర్రానికి చక్రాలు అమర్చి కోటద్వారం వద్దకు తీసుకుని వెళ్లారు. కానిద్వారంపట్టలేదు. అందుచేత ట్రోజనులుకోటగోడను ఒకచోట పగలగొట్టి విశాలమైన దారిచేసి ఆదారిన కొయ్యగుర్రాన్నినగరం



లోకి చేర్చారు. అప్పటికి కొయ్యగుర్రం గోడ కుండా పొయ్యేటప్పుడు గోడకు రాచుకున్నది.

గుర్రం గోడదాటి లోపలకి రాగానే, పడ గొట్టిన గోడను మళ్లీ యధాప్రకారం కట్టి, గుర్రాన్ని నగరమధ్యానికి చేర్చారు.

ఇప్పుడు గుర్రాన్ని గురించి ట్రోజనులలో మళ్లీ అభిప్రాయభేదాలూ, తగాదాలూ బయ లుదేరాయి. వర్ధనుడికుమార్తెఅయినజాలినికి దివ్యదృష్టిఉన్నది. ఆమెగుర్రాన్నిచూసి, "ఇందులో సాయుధవీరులున్నారు!" అని కేకపెట్టింది.

ప్రత్యామ్నాయుడి కొడుకు తీక్ష్ణదృష్టి అనే వాడుఆమెనుబలపరిచాడు. "మీరువట్టిమూఢులు! లేకపోతే గ్రీకులు దానమిచ్చినది తీసుకుం టారా?" అంటూ అతను తన శూలాన్ని గుర్రం మీదికి బలంగా విసిరాడు. అదే సమయానికి గుర్రం కడుపులో ఆయుధాలు ఒక దానికొకటి కొట్టుకున్నట్టు ఖంగున చప్పుడయింది.

చుట్టూ మూగినజనంఒక్కసారిగా అరుస్తూ, "దాన్ని తగలబెట్టండి. ఎత్తి కోటగోడల మీది నుంచి బయటికి పారెయ్యండి!" అన్నారు. వర్ధనుడి పక్షంవారు మాత్రం కొయ్యగుర్రాన్ని ఏమీ చేయవద్దని జనానికి విజ్ఞాపనలు చేసు కున్నారు.

ఈ విధంగా తర్జన భర్జనలు సాగుతున్న సమయంలో ఇద్దరు ట్రోజనుసైనికులు ఒక గ్రీకువీరుణ్ణి ఖైదుచేసి, సంకెళ్లు తగిలించి అక్కడికి తీసుకువచ్చారు. ఇతను చౌర్య నాధుడు. చౌర్య నాథుణ్ణి ట్రోజనులు రకరకాల




ప్రశ్నలువేశారు. రూపధరుడి దగ్గిర బాగా శిక్షణపొందిన చౌర్యనాథుడు ట్రోజనులకు పూర్తిగా నమ్మకం కుదిరేటట్టు, ఈ విధంగా చెప్పాడు:

"ప్రబోధుడి హత్యారహస్యం నాకు తెలుసు. తన గుట్టు నేనెరుగుదునని రూపధరుడికి నా మీద గొంతువరకూ కోపం!... గ్రీకులకు యుద్ధమంటే ఏనాడోముఖంమొత్తింది. గాలి అనుకూలించి నట్టయితే వారు చాలాకాలం క్రితమే వెళ్లిపోవలసింది! ట్రోయ్‌ని ముట్టడించ టానికి బయలుదేరి వచ్చేటప్పుడు కూడా ఇలాగే గాలి చాలా కాలం అనుకూలించకపోతే గ్రీకులు దేవతలకు బలులిచ్చి వాయుదేవుణ్ణి మంచి చేసుకున్నారు. ఈసారి రూపధరుడు

కాంశుకుణ్ణి ముందుకు లాగి, 'ఎవరిని బలి ఇవ్వాలో చెప్పు,' అన్నాడు. కాంశుకుడు పది రోజులు గడువడిగాడు. ఈలోపలరూపధరుడు అతనికి లంచం పెట్టివుంటాడని నానమ్మకం. పది రోజులయ్యాక కాంశుకుడు సదస్సులోకి వచ్చి నాకేసి వేలుపెట్టి చూపాడు. నాకుసంకెళ్ళు తగిలించారు. నన్ను బలి ఇచ్చేలోగా అదృష్టవశాత్తూ గాలి అనుకూలంగా వీచింది. వెంటనే నా సంగతి మరిచిపోయి అందరూ ప్రయాణసన్నాహంలో మునిగిపోయారు. ఆ అడావిడిలో నేను వారి నుంచి తప్పించుకు పారిపోయాను."

వర్ధనుడు చౌర్యనాథుడు చెప్పిన ప్రతి మాటా నమ్మాడు. "మరి ఈ గుర్రం మాటేమిటి?" అని ఆయన అడిగాడు.

"బుద్ధిమతి మాకు అనుకూలంగా ఉండిన మాట నిజమే. కాని రూపధరుడూ, దేవమయుడూకలిసి మీనగరంనుంచి ఆ దేవి విగ్రహాన్ని ఎత్తుకుపోయాక ఆమె మాపై ఆగ్రహించింది. ఆమె విగ్రహాన్ని మా శిబిరానికి చేర్చిన వెంటనే విగ్రహంలోనుంచి మూడు సార్లు జ్వాలలు పైకి వచ్చాయి. విగ్రహం పాదాలు చెమటతో చెమ్మగిల్లాయి. దేవికి ఆగ్రహం వచ్చినట్టు స్పష్టమయింది. ఈసారికి యుద్ధం చాలించి తిరుగుముఖం పట్టటం మంచిదనీ, బుద్ధిమతీదేవికి ఒక కానుకఅర్పించి, వెంటనే బయలుదేరవలసిందనీ, ఇంకొకసారి మంచి ముహూర్తం చూసుకుని మళ్లీ యుద్ధానికి రావచ్చుననీ కాంశుకుడు రారాజుకు సలహా ఇచ్చాడు!" అన్నాడు చౌర్యనాథుడు.



"ఇంత పెద్ద గుర్రం ఎందుకు తయారు చేశారు?" అని వర్ధనుడు అడిగాడు.

"మీరు దీన్ని నగరంలోకి తీసుకుపోకుండా చేయాలని గ్రీకుల ఉద్దేశం. ఈగుర్రాన్ని మీరు ఉపేక్షగా వదిలివేసినట్టయితే బుద్ధిమతీదేవి, మీపై ఆగ్రహిస్తుంది. అలాగాక, మీరు ఈగుర్రాన్ని శ్రమపడి నగరంలోకి తీసుకువస్తే ఇక మీకు అపజయం ఉండదు! మీసామ్రాజ్యం నలు వైపులా విస్తరిస్తుంది. ఇలాజరగకుండా, చెయ్యాలని ఇంత పెద్ద గుర్రాన్ని తయారుచేశారు," అన్నాడు చౌర్యనాథుడు.

"పచ్చి అబద్ధాలు! రూపధరుడి కల్పనలు! వర్ధనా, నువ్వీమాటలు నమ్మి చెడిపోకు!" అంటూ తీక్ష్ణదృష్టి అరిచాడు. అతను ఇంకా ఇలా చెప్పాడు: "నేనిప్పుడే వెళ్లి నా ఇష్టదేవతకు బలులిచ్చి ఆరాధించి, ఈ కొయ్యగుర్రాన్ని వెంటనే భస్మీపటలం చేసే మార్గం తెలుసుకుంటాను!"

కాని తీక్ష్ణదృష్టి ఈ పని చేయలేకపోయాడు; ట్రోయ్‌నగరాన్ని రక్షించలేక పోయాడుకూడా. ఎందుచేతనంటే, అతను ఇంటికి వచ్చినవెంటనే ఎక్కడినుంచో రెండు మహాసర్పాలువచ్చి తీక్ష్ణదృష్టి కుమారులిద్దరినీ చుట్టి చంపేశాయి. తన పిల్లలను రక్షించబోయి తీక్ష్ణదృష్టికూడా సర్పాల వాతబడిచనిపోయాడు. కొయ్యగుర్రాన్ని నాశనం చెయ్యాలన్న అతనియత్నం భగ్నమయింది.

ఈ శకునం చూడగానే ట్రోజనులకు చౌర్యనాథుడు చెప్పిన అబద్ధాలలో పూర్తిగా గురి కుదిరింది. కొయ్యగుర్రం మీద బల్లెం విసిరిన పాపానికి బుద్ధిమతీదేవి తీక్ష్ణదృష్టిని శిక్షించిందని వర్ధనుడు తలపోశాడు. ఆయన కొయ్యగుర్రాన్ని మంత్రోక్తంగా బుద్ధిమతీదేవికి అంకితం చేయించాడు. ట్రోజనుస్త్రీలు నదీతీరానికి పోయి పూలుకోసి తెచ్చి మాలలు కట్టిగుర్రం మెడమీద వేశారు. దాని నాలుగు కాళ్ల చుట్టూ పూలుపరిచారు. ఇదే సమయంలో ట్రోజనులు యుద్ధంలో విజయం లభించినందుకుగాను ఉత్సవం జరపటానికి ఏర్పాట్లు ప్రారంభించారు. ప్రశంసనుడు మాత్రం కంగారుగా తన బలాలతో సహా కదిలి ఐడాపర్వతం మీదకువెళ్లిపోయాడు. -(ముగింపు వచ్చేసంచికలో)



## చందమామ కబుర్లు

### గజఈతగాడు

జలసంధులను ఈదడం మంచినీళ్ళ ప్రాయమని మద్రాసుకు చెందిన కుట్రాలీశ్వరన్‌తో సహా అతని ఈడు బాలబాలికలు మరికొందరు నిరూపిస్తున్నారు. అందుకనే ఏమో జీ డిలీజ్ అనే ఒక ఫ్రెంచి ఈతగాడు సరాసరి అట్లాంటిక్ మహాసముద్రాన్నే ఒంటరిగా ఈదడానికి పూనుకున్నాడు. అతడు గత డిసెంబర్ 16వ తేదీ ఆఫ్రికాలోని వెర్డే ద్వీపాగ్రం నుంచి బయలుదేరి 3,860కి.మీ. ఈదుకుంటూ వెళ్ళి, రెండు నెలల తరవాత బార్బడోస్‌లోని బ్రిడ్జ్‌టౌన్‌ను చేరుకున్నాడు. అతడు ఈదేప్పుడు 'ఫ్లిప్పర్స్'ను వాడుతూ 4మీ॥ పొడవుగల తెప్పమీద నిద్రపోయేవాడు. థామస్, క్లైమెంట్ అనే అతని ఇద్దరు పిల్లలు, వాళ్ళ తల్లి కేథరిన్‌తో కలసి అతనికి ఆనందంతో స్వాగతం పలికారు!

### అమ్మకానికి కళ్ళు!

నేత్రదానం గురించి అందరికీ తెలుసు. మానవతా దృష్టితో చేసే గొప్పకార్యంగా ఇది ఇటీవల ప్రాచుర్యం పొందుతున్నది. అయితే, మూత్రపిండాలలాగా కళ్ళను అమ్ముకోవడం జరగదు. ఇప్పుడు అమ్మకానికి సిద్ధం అంటున్న కళ్ళు



మామూలు వారివి కావు. ఇంగ్లాండుకు చెందిన డా॥ హెన్రీ అబ్రామ్స్ అనే అయన తన వద్ద సుప్రసిద్ధ భౌతికశాస్త్రవేత్త ఐన్‌స్టీన్ కళ్ళు ఉన్నాయి అంటున్నాడు. వీటిని ఎంత ధర అయినా పెట్టి కొనడానికి సుప్రసిద్ధ గాయకుడు మైఖేల్ జాక్సన్‌తో సహా పలువురు ఉత్సాహం చూపుతున్నారు. 1955వ సం॥లో ఐన్‌స్టీన్ మరణించినప్పుడు ఆయన శరీరం నుంచి కొన్ని భాగాలను 'ఆటోప్సీ' ద్వారా వెలికి తీశారు. 'ఆటోప్సీ' చేసిన డా॥ థామస్ హార్వే దగ్గర ఇంకా ఐన్‌స్టీన్ మెదడు ఉన్నది. ఆటోప్సీ చేసినప్పుడు ఐన్‌స్టీన్ కళ్ళు తీయలేదని ఆయన అంటున్నారు. అయినా ఈ వివాదం ఇంకా పరిష్కారం కాలేదు!

### రికార్డు కోసం పోటీ

గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ ప్రకారం ప్రస్తుతం ప్రపంచంలో కెల్లా అతి వృద్ధురాలు ఫ్రాన్స్‌కు చెందిన జీన్ లూసీ కాల్మెంట్. ఆమె ఇటీవల తన 121వ జన్మదినోత్సవం జరుపుకున్నది. అయితే,



బ్రెజిల్‌కు చెందిన జెరోనిమా అనే వృద్ధురాలు, ఆమె కన్నా తనే వృద్ధురాలు అంటున్నది. దీనికి సరైన పత్రాల ఆధారాలు లేవుగాని 1871వ సం॥ మార్చ్ 21వ తేదీ ఒక బానిస కుటుంబంలో పుట్టిన ఆమెకు, పుట్టిన 17వ రోజు ఒక చర్చ్‌లో నామకరణం చేసినట్టు తెలుస్తున్నది. 1888వ సం॥లో బ్రెజిల్‌లో బానిసత్వాన్ని నిర్మూలించారు. నాలుగడుగులే ఎత్తున్న జెరోనిమా ఆలస్యంగా వృద్ధాప్యంలోకి అడుగుపెట్టిందని డాక్టర్లు అభిప్రాయపడుతున్నారు. గిన్నిస్ అధికారులు తమ రికార్డును మారుస్తారా అని వేచి చూడాలి!




# ముగ్గురుత్యాగులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక దేశానికి పరిపాలకుడివై సర్వ సంపదలతో తులతూగే నువ్వు, ఇంత రాత్రివేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో తిరుగాడుతుండడం, నాకు ఆశ్చర్యంతో పాటు ఎన్నో అనుమానాలకు కారణం అవుతున్నది. రాజయిన వాడు శత్రువుల నుంచే కాక, కపటులైన మిత్రులూ, భృత్యుల నుంచి కూడా తనను తాను రక్షించుకునేందుకు అప్రమత్తుడుగా ఉండాలి. తన ఆస్థానంలో పనిచేసే వారిలో ఎవరినీ కూడా ప్రభుభక్తి పరాయణుడని అవివేకంగా నమ్మి, తన రాజరికానికే ముప్పు కలిగించుకోరాదు. రాజనీతి విషయంలో ఈ ప్రధాన సూత్రాన్ని విస్మరించి, తన ఆస్థాన గూఢచారి కోసం

## బేతాళ కథలు



తన ప్రాణాన్నే పణంగా పెట్టబోయిన రాజు చంద్రసేనుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం శరశ్చంద్రికరాజ్యం రాజు చంద్రసేనుడి దగ్గర, శివదత్తుడనే యువకుడు గూఢచారిగా వుండేవాడు. వాడు రాజు పట్ల అచంచలమైన ప్రభుభక్తి కలవాడు. అప్పచెప్పిన పనిని సాధించడంలో తన ప్రాణాన్ని సైతం లెక్కచేయని శివదత్తుడంటే, రాజుకు ప్రత్యేకమైన అభిమానం.

శరశ్చంద్రిక రాజ్యానికి పొరుగు రాజ్యమైన మణిపుర రాజు ప్రచండుడు, కొంతకాలంగా శరశ్చంద్రిక రాజ్యాన్ని ఆక్రమించాలనే ఆలోచనలో వున్నాడు. ఈ సంగతి చంద్రసేనుడికి తెలిసింది. శత్రువు తమమీద దాడి చేసేలోపలే, తామే హఠాత్తుగా శత్రువు మీద దాడి చేయాలన్న ఆలోచన కలిగింది, చంద్రసేనుడికి. ప్రచండుడి సైనిక వివరాలు, అతడి కోటలో ప్రవేశానికి ఏ మార్గం సుగమమో తెలుసుకురావడానికి, ఆయన శివదత్తుణ్ణి నియమించాడు.

శివదత్తుడు ఒక సామాన్య పౌరుడి వేషంలో బయలుదేరి, రహస్యంగా మణిపుర రాజ్యంలో ప్రవేశించాడు. అతడు చాలా చాకచక్యంతో మణిపుర సైనిక బలం గురించీ, కోట లోటుపాట్లు గురించీ తెలుసుకున్నాడు.

అతడు తను తెలుసుకున్న సంగతులు సాధ్యమైనంత త్వరగా చంద్రసేనుడికి చెప్పాలన్న ఉత్సాహంకొద్దీ, అరణ్యం గుండా అడ్డదారివెంట శరశ్చంద్రిక రాజధానికి బయలుదేరాడు

శివదత్తుడికి హఠాత్తుగా, దారిపక్కన వున్న ఒక చెట్టు బోదెకు చేరగిలపడి కునికిపాట్లు పడుతున్న రాక్షసుడొకడు కనిపించాడు. వాణ్ణి చూసి నివ్వెరపోయిన శివదత్తుడు వేగంగా ముందుకు పరిగెత్తబోయేంతలో, రాక్షసుడు కళ్ళుతెరిచి, "ఆగు! నానుంచి నువ్వు తప్పించుకుని పారిపోలేవు. ఈ ఉదయాన్నే ఈ అరణ్య ప్రాంతానికి వచ్చిన నాకు దొరికిన మొట్టమొదటి మనిషివి నువ్వు!" అంటూ లేచి వచ్చి, శివదత్తుణ్ణి ఎడమచేత్తో పట్టుకుని పైకెత్తాడు.

శివదత్తుడు వణికిపోతూ, "రాక్షసా! ఒక్క క్షణం ఆగి నేను చెప్పబోయేది విను. నా పేరు శివదత్తుడు. చంద్రసేనుడనే మహారాజు వద్ద గూఢచారిగా పనిచేస్తున్నాను. శత్రురాజుకు సంబంధించిన ఒక ముఖ్యమైన సమాచారాన్ని సేకరించాను. అది మహారాజుకు త్వరగా అందజేయాలి. ఆ తర్వాత తిరిగివచ్చి నీకు ఆహారం అవుతాను," అన్నాడు.

అందుకు రాక్షసుడు నవ్వి, "ఒకసారి వదిలితే మళ్ళీ నువ్వు, నాకు దొరుకుతావా? ఇంతకూ నువ్వు సేకరించిన సమాచారం ఏమిటి?" అని అడిగాడు.

"అది మహారాజుకు తప్ప మరెవరికీ చెప్పడం జరగదు," అన్నాడు శివదత్తుడు.

రాక్షసుడిలో పంతం పెరిగి, "అది చెబితేనే నిన్ను వదులుతాను. లేకుంటే, ఈ క్షణానే తినేస్తాను," అన్నాడు.

"అలాగే చెయ్యి," అన్నాడు శివదత్తుడు తొణక్కుండా.

ఆ జవాబుకు రాక్షసుడు తృప్తిపడి, "ఆహా, నిన్ను మెచ్చాను. రాజుకు చెప్పవలసిందేదో చెప్పి, త్వరగా తిరిగిరా," అన్నాడు.

శివదత్తుడు, రాక్షసుడికి కృతజ్ఞతలు చెప్పుకుని, వేగంగా నగరం చేరి, రాజు చంద్రసేనుడికి మణిపుర రాజ్యంలో తను సేకరించిన వివరాలన్నీ చెప్పాడు. ఆతర్వాత అక్కడినుంచి వెళ్ళేందుకు తొందరపడుతున్న శివదత్తుణ్ణి, కారణమేమిటని రాజు అడిగాడు.




శివదత్తుడు, రాక్షసుణ్ణి గురించి చెప్పి, "మహారాజా! మిమ్మల్ని ఒకే కోరిక కోరుతున్నాను. నా కుటుంబానికి ఏ లోటూ లేకుండా చూడండి!" అని అక్కడినుంచి బయలుదేరి అరణ్యానికి పోయాడు.

శివదత్తుడి సత్యవ్రతానికీ, ప్రభుభక్తికీ పులకించిపోయిన చంద్రసేనుడు, మంత్రులకు రాజ్యానికి సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు చెప్పి — శివదత్తుడికి తెలియకుండా అతణ్ణి అనుసరించి అరణ్యం చేరాడు.

అన్నమాట ప్రకారం తనదగ్గరకు తిరిగి వచ్చిన శివదత్తుణ్ణి చూసి, రాక్షసుడు ఎంతగానో సంతోషించాడు. అయితే అంతలో రాజు చంద్రసేనుడు, రాక్షసుడి ముందుకు



వచ్చి, "రాక్షసోత్తమా! శివదత్తుడి సత్యదీక్ష చూశావుగదా? అతను నా పనిమీద వుండగా, నీకంటబడ్డాడు. అందువల్ల, అతణ్ణి కాపాడు కోవలసిన బాధ్యత నాకుంది. దయచేసి అతణ్ణి వదిలి నన్ను ఆహారంగా స్వీకరించు," అన్నాడు.

అదివిన్న శివదత్తుడు, "మహారాజా! నా బోటివాడు మరణిస్తే, నా కుటుంబానికి తప్ప మరెవరికీ నష్టం కలగదు. మీరు మరణిస్తే, రాజ్యమే అల్లకల్లోలమవుతుంది," అని రాక్ష సుడి కేసి తిరిగి, "నువ్వు నన్ను చంపి తిన డమే న్యాయం," అన్నాడు.

దానికి రాజు, "శివదత్తా! రాజ్యం గురించి ఏమీ భయం లేదు. నువ్వు రాజధాని చేర గానే మంత్రులు నిన్ను రాజుగా అభిషేకించే ఏర్పాట్లు చేసివచ్చాను. నీవంటివాడి పాలనలో ప్రజలు మరింత సుఖపడతారు," అన్నాడు.

వాళ్ళ సంవాదం వింటున్న రాక్షసుడికి గొప్ప ముచ్చట వేసింది. వాడు, "ఇంతవరకు నన్ను చూసి భయంతో పారిపోయిన వాళ్ళనే చూశానుగాని, చావడానికి పోటీపడే వాళ్ళను చూడలేదు. అయితే ఒక సంగతి – నేను మీ ఇద్దర్నీ చంపి తింటానేమో అన్న అనుమానం మీక్కలగలేదా?" అని అడిగాడు.

అందుకు రాజు చిన్నగా నవ్వి, "నువ్వు శివదత్తుణ్ణి చంపక వదిలినప్పుడే, నీలో యుక్తాయుక్త విచక్షణ వున్న విషయం గ్రహిం చాను. అందువల్లనే నేను, నీ ముందుకు ఒంటరిగా వచ్చాను. అలాకానప్పుడు సైన్యంతో వచ్చి నీతో యుద్ధానికి పూనుకునే వాడిని," అన్నాడు.

ఇందుకు రాక్షసుడు, రాజును మెచ్చుకుని, "సరే! ఇంతకూ నేను మీలో ఎవర్ని చంపి తినాలో తేల్చండి. నాకు చాలా ఆకలిగా వుంది," అన్నాడు.

వెంటనే శివదత్తుడు, రాజుతో, "మహా రాజా! మీరు చెప్పినట్లు నేను రాజ్య సంరక్షణ భారం వహించలేను. అది నా శక్తికి మించిన పని. క్షమించి, మీరు రాజ్యానికి వెళ్ళండి," అన్నాడు.

రాజు ఒక్క క్షణం ఆలోచించి, రాక్షసుడితో, "నువ్వు మాలో ఎవర్ని ఆహారం చేసుకోవాలో

తేల్చి చెప్పగలను. అయితే నువ్వు కాస్త ఓపిక పట్టాలి," అన్నాడు.

"సరే! ఆహార విషయంలో ఎలాగో సర్దుకుంటాను. దాచక సంగతేమిటో తేల్చు!" అన్నాడు రాక్షసుడు.

"అయితే, విను! శివదత్తుడు రాజధానికి వెళ్ళి, సైన్యానికి నాయకత్వం వహించి, మణిపురి రాజు ప్రచండుడి మీదికి యుద్ధానికి వెళతాడు. శివదత్తుడు, ప్రచండుణ్ణి ఓడించ గలిగితే, అతడే నా రాజ్యానికి రాజు అవుతాడు. నేను నీకు ఆహారం అవుతాను. అలా కాని పక్షాన నేను రాజ్యానికి పోతాను, శివదత్తుడు నీకు ఆహారం అవుతాడు," అన్నాడు.

ఇందుకు రాక్షసుడు సమ్మతించి, "శివదత్తా! నువ్వు మారుమాట్లాడకుండా పోయి, రాజు చెప్పినట్టు చెయ్యి. నువ్వు తిరిగి వచ్చేంతవరకూ, రాజు నాదగ్గర బందీగా వుంటాడు," అన్నాడు.

శివదత్తుడు, రాజు చంద్రసేనుడు చెప్పినట్లు రాజధానీ నగరం చేరి, సైన్యంతో బయలుదేరిపోయి, ప్రచండుడి కోటను ముట్టడించాడు. వారం రోజుల తర్వాత ప్రచండుడు, శివదత్తుడి చేతిలోఓడిపోయాడు.అతడు శత్రురాజును బందీని చేసి చెరసాలలో వుంచాడు.

తర్వాత శివదత్తుడు, రాక్షసుడి దగ్గరకు తిరిగివచ్చాడు. అతడివెంట వున్న ఒకఅందమైన యువతిని చూసి రాక్షసుడు, "ఎవరీ పిల్ల?" అని కుతూహలంగా అడిగాడు.



అందుకు శివదత్తుడు, "యుద్ధంలో నేను ప్రచండుణ్ణి ఓడించగలిగాను. ఈమె ప్రచండుడి కుమార్తె మందాకిని. ఈమె, మా మహారాజును ప్రేమించింది. వివాహమాడితే, శరశ్చంద్రిక రాజునే వివాహమాడతానని ప్రతిన పూనింది," అన్నాడు.

ఈ జవాబుకు రాక్షసుడు ఆశ్చర్యపోతూ, "అయితే ఇప్పుడేం చేద్దాం?" అని అడిగాడు.

"మహారాజు మీద ఎన్నో ఆశలు పెట్టుకున్న ఈమెకు మనోవ్యథ కలిగించడం న్యాయం కాదు. మహారాజును వదిలి నన్ను ఆహారం చేసుకో," అన్నాడు శివదత్తుడు.

రాక్షసుడు, రాజు చంద్రసేనుడితో, "రాజా! విన్నావుగదా. నీవేమంటావు?" అన్నాడు.



చంద్రసేనుడు అయిష్టంగా, "నా ప్రమే యంలేని ఆమె ప్రేమకు నేనెలా బాధ్యుణ్ణి? నేను ముందే చెప్పిన విధంగా, ప్రచండుణ్ణి ఓడించిన మరుక్షణం నుంచీ, శరశ్చంద్రిక రాజు శివదత్తుడే! మందాకిని ప్రతిన పట్టింది శరశ్చంద్రిక రాజునే వివాహమాడతానని కాబట్టి, ఆమెను శివదత్తుడు వివాహమాడితే సమస్య తీరిపోతుంది," అన్నాడు.

వెంటనే మందాకిని, రాక్షసుడితో, "రాక్షసో త్తమా! ఇదంతా నేనూహించనిది. నా దృష్టిలో శరశ్చంద్రిక రాజును వివాహమాడడమంటే, చంద్రసేన మహారాజును వివాహమాడడమే. మహారాజు ఆడిన మాట తప్పని సత్యసం ధుడు. ఆయన అన్న ప్రకారం శివదత్తుణ్ణి విడిచి, ఆయనతో పాటు నన్ను కూడా ఆహా రంచేసుకో. మహారాజుతో ఎలానూ కలిసి జీవించలేను, కనీసం కలిసి మరణించే వరమివ్వు!" అన్నది.

రాకుమారి మందాకిని మాటలు విన్న రాక్షసుడు నిర్ఘాంతపోయి, ఒక్క క్షణం తన ఎదుట వున్న ముగ్గురికేసీ పరీక్షగా చూసి, "ఇంత కాలంగా నేను, మానవులందరూ శారీరకంగానే కాక, మానసికంగా కూడా అత్యంత బలహీనులనుకునే వాణ్ణి. స్వార్థం, పరపీడన, ఓర్వలేనితనం మూర్తీభవించిన అల్పజీవులుగా వాళ్ళు నాకు కనిపించేవాళ్ళు. ఇప్పుడు మీ ముగ్గురినీ చూస్తూంటే – ప్రభు భక్తీ, భృత్యుడి పట్ల ఆదరణా, ప్రేమానురా గాలూ, మనిషిని ఎంత ఉన్నతుణ్ణీ, దైవాంశ కలవాణ్ణీ చేయగలవో అర్థమవుతున్నది. ఇందువల్ల నేను, తన రాజు కోసం ఆత్మా ర్పణకు సిద్ధపడిన శివదత్తుడి వంటి ప్రభుభక్తి పరాయణుడినీ, ఒక సేవకుడి రక్షణ కోరి ప్రాణాలివ్వడానికి వెనుకాడని రాజు చంద్రసే నుడి వంటి త్యాగనిరతుణ్ణీ, ప్రేమించిన వాడికోసం బలి కావడానికి సంసిద్ధురాలైన యువతినీ – ఈ ముగ్గురిలో ఎవర్ని చంపినా, అది అతిహేయమైన కార్యమవుతుంది. నేను సంతోషంగా మీ ముగ్గురినీ విడిచిపెడుతు న్నాను. ఈక్షణానే ఈ అరణ్యాన్ని వదిలి దూర తీరాలకు వెళ్ళిపోతున్నాను," అంటూ ఆకాశం లోకి ఎగిరి క్షణాలమీద అదృశ్యుడయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శివదత్తుడి ప్రవర్తన గురించి మనసులో నాకు కొన్ని సందేహాలున్నాయి. నిజంగానే అతడు అంత గొప్ప ప్రభుభక్తిపరాయణుడైతే, ప్రచండుడి చేతిలో ఓడిపోయి వుండవచ్చు. అప్పుడు, రాజు చంద్రసేనుడు రాక్షసుడికి ముందు వాగ్దానం చేసిన విధంగా, శివదత్తుడు రాక్షసుడికి ఆహారమై వుండేవాడు. కానీ అలా చేయక సర్వశక్తులూ ఒడ్డి ప్రచండుణ్ణి ఓడించాడు, శివదత్తుడు. రాజు, రాక్షసుడితో అన్న ప్రకారం, ఈ పరిస్థితుల్లో రాజు రాక్షసుడికి ఆహారమైపోవాలి! యుద్ధంలో గెలిచాక, యువరాణి మందాకిని ప్రసక్తి వచ్చి వుండకపోతే, శివదత్తుడు రాజై, చంద్రసేనుణ్ణి రాక్షసుడికి ఆహారంగా వదిలిపోయే వాడేగదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వీరుడూ, ప్రభుభక్తిపరాయణుడైన వాడెప్పుడూ, తన క్షేమాన్ని కాక, ముందు రాజ్య క్షేమాన్ని చూస్తాడు. ప్రచండుడి చేతిలో ఓడితే, రాజ్య ప్రతిష్ఠ మంట కలుస్తుంది. అందువల్లనే శివదత్తుడు, శత్రురాజును సర్వశక్తులూ ఒడ్డి ప్రాణానికి తెగించి ఓడించాడు. అయితే, ఇందువల్ల తన రాజు, రాక్షసుడికి ఆహారం అయ్యే ప్రమాదం వున్న మాట నిజం. కానీ శివదత్తుడు అప్పటివరకూ రాక్షసుడి ప్రవర్తనను సూక్ష్మంగా పరిశీలించి వుండడంతో – అతడికి రాక్షసుడిలో అంతో ఇంతో దయాగుణం, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం వున్నట్టు గ్రహించాడు. అటువంటి వాడు కేవలం తన ఆకలి తీర్చుకునేందుకు ఎవరినీ చంపడు. ఆ కారణంగానే శివదత్తుడు, శత్రురాజును ఓడించేందుకు పూనుకున్నాడు. ఇవన్నీ పరిగణనలోకి తీసుకున్నప్పుడు రాజు చంద్రసేనుడు, తన భృత్యుడి ప్రభుభక్తి విషయంలో ఏమాత్రం పొరపాటు చేయలేదని రుజువవుతున్నది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]



# చెక్కచెప్పులు - తోలుచెప్పులు

హేలాపురిలోని ఒక వైద్యశాలలో చికిత్స పొందుతున్న తన బంధువును చూడవచ్చాడు, కేశవులు. ఆ వైద్య శాలలో, అంతగా మతిస్థిమితం లేనివారికి కూడా చికిత్స చేస్తూంటారు.

తన బంధువును చూడడానికి ఇంకా ఒక గంట కాలం వేచి వుండాలని తెలుసుకున్న కేశవులు, అక్కడున్న ఒక బల్లమీద కూర్చున్నాడు. అప్పటికే మరొక వ్యక్తి అక్కడున్నాడు. మాటల సందర్భంలో కేశవులు ఆ వ్యక్తితో, తన బంధువుకు మతిస్థిమితం ఎందుకు తప్పిందో చెప్పి, "మీరెవరి కోసం వచ్చారు?" అని అడిగాడు.

అందుకా వ్యక్తి, "నేనిక్కడ నాలుగైదు నెలలుగా చికిత్స పొందుతున్నాను. నాలో కొంత మతిస్థిమితం తప్పిన లక్షణాలున్నవంటున్నారు," అన్నాడు.

ఇంతవరకూ తనతో ఎంతో సౌమ్యంగా, తెలివిగా మాట్లాడిన వ్యక్తిలో అవలక్షణాలేమిటని కేశవులు ఆశ్చర్యపోతూ, "మీరు చూడబోతే ఇంత చక్కగా మాట్లాడుతున్నారు. మీకీ వైద్యశాలలో చికిత్స ఏమిటీ?" అన్నాడు.

అందుకా వ్యక్తి చిన్నగా నవ్వి, "ఎన్నో ఏళ్ళుగా మతిస్థిమితం లేని వాళ్ళకు వైద్యం చేసీ చేసీ, ఇక్కడి వైద్యుడే మతిస్థిమితం కోల్పోయాడేమో అని, నా అనుమానం. సరేగానండి — నాకు చెక్కచెప్పుల కంటే, తోలుచెప్పులంటేనే ఇష్టం. మరి నీకో?" అని ప్రశ్నించాడు.

"నాకూ తోలుచెప్పులంటేనే ఇష్టం!" అన్నాడు కేశవులు.

"అలాగా! అయితే, మీరు వాటిని ఉడకబెట్టుకుని తింటారా? వేయించుకుని తింటారా?" అని ఆవ్యక్తి ఆతృతగా అడిగాడు. ఆప్రశ్న విన్న కేశవులుకు ఒక్క క్షణం మతిపోయినట్టయి, అక్కడ నుంచి లేచిపోయాడు.

— కోనే నాగవెంకట అంజనేయులు



## మనదేశపు కోటలు - 4

చుట్టూ మెరిసే ఎడారి ఇసుక మధ్య పసుపు రంగు సున్నపురాయి గోడలు గల జైసల్మేర్ కోట ఉదయసూర్యుడి కిరణాలు పడేప్పుడు బంగారుకోట లాగా అత్యంత శోభాయమానంగా కనిపిస్తుంది.

1156వ సం॥లో భాటీరాజు రావల్ జైసాల్ దేవ నిర్మించిన ఈ కోట ప్రత్యేకత దీని జంట ప్రహరీలు. వెలుపలి గోడ, లోపలి గోడ సగం ఎత్తు నుంచి, దానిని పై బట్ట లాగా మడిచి కట్టినట్టు ఉంటుంది. స్థానికులు దీనిని కమర్‌కోట్ అనీ, పాదా అనీ అంటారు.

ఈ కోట అనేక యుద్ధాలు చూసింది. ఢిల్లీ సుల్తాన్ బాల్బన్ చేసిన సుదీర్ఘమైన ముట్టడి 1276 నుంచి 1283 వరకు సాగింది.



జైసల్మేర్ కోట

# రాజపుత్రుల కోటలు - II

రచన : మీరా ఉగ్రా ♦ చిత్రాలు : సులభా ఠాకూర్

జైసల్మేర్, వర్తక వాణిజ్యాలకు కేంద్రంగా ఉండేది. ఆఫ్ఘనిస్తాన్, సిరియా, ఇరాన్, ఇరాక్, ఈజిప్టు మొదలైన దేశాలకు వెళ్ళే వర్తక బిడారుల రాకపోకలు ఈ పట్టణం గుండా సాగేది. 1570వ సం॥లో భాటీలకు అక్బర్‌తో మైత్రీ సంబంధాలు ఏర్పడిన తరవాత ఈ వ్యాపారాలు మరింత వేగంగా పెరిగాయి. జైన వ్యాపారులు దేవాలయాలనూ, హవేలీలనూ నిర్మించారు. అవి శిలాఫలకాలతో నిర్మించిన గవాక్షాలకూ, డాబాలకూ, కుడ్యచిత్రాలకూ పేరెన్నిక గన్నవి.



జైసల్మేర్ సునిశితమైన గవాక్షాలు, శిలాఫలకాలు



రాజస్థాన్‌లోని మిగతా కోటలతో పోల్చినప్పుడు కొత్తదని చెప్పతగిన బికనీర్‌లోని జూనాఘడ్ కోట (1594) చక్కగా పరిరక్షింపబడుతున్నది. భవనాలలోని శిలాగవాక్షాలు, కుడ్యచిత్రాలు సుందరమైనవి. గవాక్షాలలోని శిలాఫలకాలు వెలుపలి ఎడారి వేడిగాలులను లోపలికి రానీయకుండా చల్లగా ఉంచుతున్నాయి.

జైపూర్ సమీపంలోని అంబర్‌ఘడ్ కోట కచ్చావాహా పాలకులు నిర్మించిన అందమైన భవనాలకు ప్రసిద్ధి

జునాఘడ్ కోట



బికనీర్ రాజభవనం లోపలి భాగం

గాంచినది. అంబర్‌ఘడ్‌కు పర్యవేక్షణ శిఖరాలుగా జైఘడ్, నాహర్‌ఘడ్ అనే రెండు కోటలను నిర్మించారు. ఈ మూడు కోటలూ ఎప్పుడూ ముట్టడిని గాని, యుద్ధాన్ని గాని ఎదుర్కోలేదు.



జైఘడ్ కోట
పర్యవేక్షణ శిఖరం

'చీల్' కొండమీద నిర్మించబడిన జైఘడ్ కోటలో ఫిరంగులు తయారుచేసే కార్ఖానా ఉన్నది. అంబర్ కోట నుంచి ఈ కోటకు రహస్య సొరంగ మార్గం ఉన్నది. ఈ కోటలోని లోపలి గదులలో రాజకుటుంబానికి చెందిన నిధులను దాచేవారు. ఈ కొండ ప్రాంతాల నివసించే మీనా తెగవారు ఈ సంపదను కాపలా కాసేవారు. మరొకదారి లేని అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు, రాజే అక్కడికి స్వయంగా వెళ్ళి, కావలసిన ధనం తెచ్చుకునే వాడు. అప్పుడు కూడా మీనా తెగ నాయకుడు రాజు కళ్లకుగంతలు కట్టి నిధులున్నగది దగ్గరికి తీసుకు వెళ్ళేవాడు. రాజు అవసరం గడవడానికి తగిన ధనమే తెచ్చుకునేవాడు.

మన దేశంలో చాలా బరువైనదని చెప్పబడే బ్రహ్మాండ మైన జైవాన్ ఫిరంగి కూడా జైఘడ్‌లోనే ఉన్నది. దీనిని పరీక్షార్థం ఒకే ఒకసారి మాత్రమే పేల్చారు.



జైవాన్

1732వ సం॥లో సూరజ్‌మల్ అనే జాట్ రాజు భరత్‌పూర్‌లో అంతకు ముందున్న కోట మీద లోహఘడ్ కోటను నిర్మించాడు. ఈ కోట ప్రహరీ గోడ మట్టిదేగాని ఫిరంగుల దాడిని ఎదర్కొని దృఢంగా నిలబడగలది.

1825వ సం॥ నవంబర్ నెలలో ఈస్టిండియా కంపెనీకి చెందిన 27,000 మంది సైనికులు ఈ కోటను ముట్టడించారు.

64,446 ఫిరంగి గుండ్లు నిష్ప్రయోజనమని తేలాక ఉత్తరపు వైపు గోడను పేల్చ డానికి 10,000 పౌన్ల



లోహఘడ్ కోట

లుడు పదార్థాన్ని ఉపయోగించారు. ఆ ప్రేలుడు
ం ఆగ్రా వరకు వినిపించింది. 1826 జనవరి 18వ తేదీ
త్‌పూర్ పతనమయింది.

1241వ సం॥లో దేవసింగ్ అనే ఒక హాడా నాయకుడు
నా తెగ నాయకుడు బుండూను ఓడించి బుండీ రాజ
నిగా హాడౌతీ రాజ్యాన్ని స్థాపించాడు. ఆయన ముని
నుమడు రావ్‌బార్ సింగ్ 1352వ సం॥లో తారాఘడ్
ను నిర్మించాడు. ఆయన వంశస్థులు ఆ రాజ్యాన్ని
0 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా పరిపాలించారు.

హాడా సైనికులకు సంబంధించిన వీర సాహస
లు కోకొల్లలుగా ప్రచారంలో ఉన్నాయి. ఒకప్పుడు
దయ్‌పూర్ రాణా లఖా, బుండీ కోటను పట్టుకునేంత
కు ఆహార పానీయాలు ముట్టుకోనని ప్రతిజ్ఞ
డు. ఆయన ఆరోగ్యం క్షీణించడం ప్రారంభించడంతో,
హాదారులు ఆయన ఆరోగ్యం కాపాడుకోవడానికి ఒక
లీ కోటను ఏర్పరచి దానిని 'జయించ'మని చెప్పారు.
నకిలీ కోటకు కుంభ్ హాడా అనే సైనికుణ్ణి రక్షకుడిగా
ర్పాటుచేసి, రాణా రాగానే లొంగిపోవాలని ఆజ్ఞాపించారు. అనుకున్న
యానికి కొద్దిపాటి సైన్యంతో 'కోట' మీదికి రాణా 'ముట్టడి' ప్రారంభ
ుంది. అయినా, నకిలీ కోట నుంచి బాణాలు నిరాటంకంగా సైనికుల మీదికి దూసుకు రాసాగాయి. ఆశ్చర్యాగ్రహ
లతో కోట లోపలికి వచ్చిన సైనికుల మీదికి కుంభ్ హాడా కత్తి దూసి, "కోట నకిలీదే కావచ్చు. కానీ హాడా అసలైన
కుడు. నా తనువులో ప్రాణం ఉండగా బుండీని పడనివ్వను!" అని హుంకరించాడు. ఈ సంఘటనను కళ్ళారా
సిన రాణా దిగ్భ్రాంతి చెంది, అంతటితో బుండీని జయించే పథకాన్ని వదులుకున్నాడు.

'రాగమాల', 'బారామస' వంటి చిన్న చిత్రాలకు ప్రసిద్ధిగాంచిన చిత్రకారులెందరో బుండీ కోటలో ఉండేవారు.


నకిలీ ముట్టడి

తారాఘడ్ కోట



# పోతురాజు భూతాలు

బొందలచెరువు గ్రామంలో వుండే పోతురాజు, పేరుమోసిన భూతమాంత్రికుడు. అతడి పేరు చెబితేనే చాలు దయ్యాలూ, భూతాలూ ఊరి పొలిమేరలు దాటి పారిపోతాయని జనం గట్టిగా నమ్మేవాళ్ళు. ఆయన భార్య అన్నపూర్ణమ్మ బహు దొడ్డ ఇల్లాలు. సార్థకనామధేయురాలు. పోతురాజు స్వభావం అతడి భార్య స్వభావానికి పూర్తి వ్యతిరేకం. తన ఇంటిలో వండిన వంటకాల వాసన వీధిలోకి తగిలినందుకే బాధపడతాడు, భార్యపై మండిపడేవాడు.

ఒకనాటి సాయంసంధ్యవేళ నలుగురు వ్యక్తులు అన్నపూర్ణమ్మ ఇంటికి వచ్చారు. వాళ్ళు ఆమె పుట్టంటి తరపున దూరపు బంధువులు.

"అమ్మా! చాలా దూరం నుంచి వస్తున్నాం. ఇంకా ఎంతో దూరం పోవాల్సివుంది. బాగా అలిసిపోయాం. ఈ రాత్రికి ఇంత భోజనం ఏర్పాటు చేశావంటే, తిని మా దారిన మేం పోతాం," అన్నారు వాళ్ళు అన్నపూర్ణమ్మతో.

"అలాగే! మీరు కాసేపు ఆ అరుగు మీద విశ్రాంతి తీసుకోండి. వంట సిద్ధం చేస్తాను," అంటూ వంట ప్రయత్నంలో పడింది అన్నపూర్ణమ్మ.

ఆమె భర్త పోతురాజు, నాలుగు కోసుల దూరంలో వున్న ఏదో ఊరిలో, ఎవరికో భూతం పట్టిందని కబురు అందగా, దాని అంతుచూడడానికి వెళ్లాడు. భర్త తిరిగివచ్చేలోగానే వచ్చిన అతిథులకు భోజనం పెట్టి పంపగలనన్న ఆలోచన కొద్దీ, వాళ్ళను వుండమన్నది అన్నపూర్ణమ్మ. అలాకాక, పోతురాజు పెందలకాడే ఇంటికి తిరిగి రావడం జరిగితే, వచ్చిన అతిథులు ఈ రాత్రి అన్నానికి బదులు బడితెదెబ్బలు తినగలరన్న సంగతికూడా ఆమెకు తెలుసు.

అన్నపూర్ణమ్మ క్షణాలమీద వంట పూర్తిచేసి అతిథులకు వడ్డన చేసింది. వాకిటి తలుపులు



వేగిరంకానివ్వండి. నా భర్త వస్తున్నాడు. ఆయన స్వభావం ఎంత కఠినమైనదో, ఆ భూతప్రేతాలకూ, గ్రామంలో వాళ్ళకూ, నాకూ మాత్రమే తెలుసు. ఇంట్లోకి వచ్చి చూశాడంటే మీకూ, నాకూ బడితె పూజ తప్పదు. నేను పెరట్లోకి వెళ్ళిపోతున్నాను. నా భర్త వచ్చి తలుపు కొట్టినా, మీ భోజనాలు అయ్యే వరకూ తలుపు తీయకండి. ఆ తర్వాత ఈ దీపం ఆర్పి, తలుపు తీస్తూనే వాయువేగంతో బయటికి పరిగెత్తండి. అమావాస్య చీకటి, జాగ్రత్త సుమా!" అంటూ పెరట్లోకి వెళ్ళి పోయింది.

కేకవేసి ఒకటి, రెండు క్షణాలయినా తలుపులు తెరుచుకోక పోయేసరికి, "ఒసే, ఇల్లాలా!" అంటూ తలుపుల మీద గట్టిగా బాదాడు పోతురాజు.

గడియ వేసింది. తలవని తలంపుగా భర్త వస్తాడేమోనన్న అనుమానం కొద్దీ, కిటికీలోంచి వీధిలోకి చూడసాగింది. అతిథులు ఆవురావు రుమంటూ భోజనాలు చేస్తున్నారు.

ఇంతలో వీధి మలుపులో కుక్కలు పెద్దగా మొరిగినై. అన్నపూర్ణమ్మ ఊహను నిజం చేస్తూ, పోతురాజు వీధి మలుపు తిరుగుతూనే, చేతిలో వున్న రాగికట్లకర్రతో అందుబాటులో వున్న కుక్క నొకదాన్ని గట్టిగా కొడుతూ, "ఊర కుక్కలకేం తెలుసు, భూతాలపోతురాజు మంత్ర శక్తి!" అంటూ గట్టిగా అరిచాడు.

అప్పటికి అతిథుల భోజనాలు పూర్తికావస్తు న్నాయి. అన్నపూర్ణమ్మ వెంటనే కిటికీరెక్కలు మూసి అతిథులతో, "అయ్యా! మీ భోజనాలు

ఆ మరుక్షణం కిర్రుమనే పెద్ద శబ్దంతో తలుపులు బార్లా తెరుచుకున్నవి. ఇంటిలోపల అంతా చిమ్మచీకటి. ఆచీకటిలోంచి నాలుగు ఆకారాలు వేగంగా ముందుకు దూసుకువచ్చి, అడ్డంగా నిలబడివున్న పోతురాజును నేలకు పడదోసి, అతణ్ణి తొక్కుకుంటూ చీకట్లోకి పారిపోయాయి.

"చచ్చాన్రోబాబో!" అంటూ పోతురాజు పెద్దగా కేక వేసి, "ఏమిటివి? మనుషులా? భూతాలా?" అంటూ లేవబోయి బాధతో చతికిలబడి, కాలు విరిగినట్టా? చెయ్యి బెణికినట్టా అనుకుంటూ, "ఏమే ఇల్లాలా!

నువ్వెక్కడ అఘోరిస్తున్నట్టు?" అంటూ మరింత పెద్దగా కేక పెట్టాడు.

"ఇదుగో, వచ్చె, వచ్చె!" అంటూ అన్నపూర్ణమ్మ, ఒక ప్రమిదెలో దీపం వెలిగించుకుని భర్త దగ్గరకువచ్చి, "ఇదేమిటి? గుడ్డలనిండా సొరకాయ పులుసు మరకలు, తలమీద చిరిగిన విస్తరాకు. ఆహా, ఇదంతా వాటిపనే!" అన్నది ఆశ్చర్యపడుతూ.

ఆసరికి పోతురాజు మూలుగుతూ లేచి నిలబడి, "ఏమిటి, వాటిపనే?" అంటూ ఇంట్లోకి వచ్చి, అక్కడ నేలమీద చిందర వందరగా పడివున్న అన్నం, కూరలూ చూస్తూ, "ఏమే, నేను ఇంట లేకుండా చూసి, దారిన పోయేవాళ్ళందర్నీ పిలిచి సంతర్పణ చేశావా?" అంటూ పట్టరాని కోపంతో తాటి ఎత్తున లేచాడు.



అన్నపూర్ణమ్మ చేతిలో వున్న ప్రమిదను అందుబాటులో వున్న ముక్కాలిపీట మీద పెట్టి, "మీరు ఎన్నయినా అనండి. పొద్దునే ఏ పుణ్యాత్మురాలి ముఖం చూశానో, నా పసుపుకుంకాలు నాకు దక్కాయి," అన్నది.

"అదేమిటే! నేను అడిగిన దానికీ, నువ్వనేదానికీ ఏమిటి సంబంధం?" అంటూ, ఏదో సందేహం కొద్దీ గొంతు తగ్గించాడు పోతురాజు.

అన్నపూర్ణమ్మ లేని కన్నీళ్ళను పమిట చెంగుతో తుడుచుకుంటూ, "ఇప్పుడు బాధ పడి లాభమేమిటి లెండి! మీరీ భూత వైద్యం నేర్చుకోకుండా, ఏ వ్యవసాయంలోనో, వ్యాపారవృత్తిలోనో కుదురుకుంటే బావుండేది," అంటూ ఏదో చెప్ప బోతూండగా, పోతురాజు ఆమె నడ్డుకుని కోపంగా, "ఏమిటీ పొంతనలేని మాటలు? నిన్నేదైనా భూతం పట్టిందా?" అంటూ భార్యకేసి అనుమానంగా చూశాడు.

"అదీ ఏదో ఒకరోజున జరిగి తీరుతుంది. ఇప్పుడు జరిగిందేమిటో వినండి! మీరు పొరుగూరు వెళ్ళి, అక్కడి వాళ్ళకు పట్టిన భూతాలను వదలగొట్టారుగదా — అవి తిన్నగా వాటిదారినవి పోక, మన ఇంటిమీదికి వచ్చి పడ్డాయి. అవి నన్ను నానా దుర్భాషలాడుతూ, "ఏమే, భూతాల పోతురాజు ఇల్లాలా! మేము

తీరని కోర్కెలు తీర్చుకోవడానికీ, కావలసిన తిండి తినడానికీ మనుషులను ఆవహిస్తుంటే, కుంటీ, గుడ్డీ మంత్రాలు మా మీద ప్రయోగించి. మాకు నిలవనీడ లేకుండా చేస్తాడా నీ మొగుడు? ఇంటికి తిరిగి రాగానే ఏమి చేస్తామో చూడు! చచ్చుపుచ్చు తాళపత్రాలూ, పురుగ్గొట్టిన వేపమండలూ అలా కింద పెట్టగానే, జాయ్ మంటూ మీదపడి నిలువునా విరుచుకుతింటాం. అప్పుడుగానీ మా ఆకలి తీరదు. అని నట్టింట్లో పీఠం వేశాయి," అని చెప్పింది అన్నపూర్ణమ్మ.

ఇది వింటూనే పోతురాజు, జారిపోతున్న జుట్టుముడిని గట్టిగా బిగించి, "ఎక్కడవి? ఎక్కడ?" అంటూ ఏదో మంత్రం ఉచ్చరించబోయాడు.

"ఆగండి, అప్పుడే కథ అయిందా! ఆ భూతాల వాలకం చూస్తూంటే, ఆకలితో నకనకలాడుతున్నట్టు కనిపించినై. దానితో నాకు అవి అన్నంత పనీ చేయగలవని నమ్మకం కలిగి, గుండిగడు అన్నం, ఒక తట్టనిండు కూరలూవండి, వాటి ముందు కుంభం పోశాను. అవి తృప్తిగా తింటూండగా, మిమ్మల్నిక కరుణించి వదిలిపెట్టమని ప్రార్థించాను. అన్నీ అందుకు సరేనన్నట్టు తలఊపాయిగాని, వాటిల్లో కుంటికాలూ, మెల్లకంటి భూతం మాత్రం — నీ మొగుణ్ణి చింత నిప్పుల మీద కాల్చుకుని తినకపోతే, నేను అడవిపాలెం ఎల్లమందనే కాదు, అంటూ ఒంటికాలి మీద లేచి కోపంగా చిందులు ప్రారంభించింది. అంతలో మీరు రావడం, అవి నామీద జాలి కొద్దో, మీరంటే భయం వల్లో బయటికి పారిపోవడం జరిగింది," అన్నది అన్నపూర్ణమ్మ.

"అలాగా!" అంటూ భూతాల పోతురాజు నిలువెల్లా వణికిపోతూ,"ఆ భూతాల్లో ఎల్లమంద కూడా వున్నాడన్నమాట? ఎంత గండం తప్పింది!" అని ఏవో మంత్రాలు వల్లిస్తూ, పూజగదిలోకి పోయి తలుపులు బిగించుకున్నాడు.

భర్తగదిలోకి పోగానే అన్నపూర్ణమ్మ ఒకసారి తృప్తిగా నిట్టూర్చి, అంతకు ముందు తను తిట్టిన భూతాలకు క్షమాపణలు చెప్పుకున్నది.






చదలవాడ గ్రామంలోని భూపతి అనే రైతుకు పనివాడు కావలసి వచ్చింది. ఈ సంగతి ఆయన తన స్నేహితుడైన చలపతికి చెప్పాడు.

దానికి చలపతి, "నాదగ్గర ఇద్దరు పని వాళ్ళున్నారు. నమ్మకస్థులు. ఇద్దరికిద్దరూ మంచివాళ్ళు కూడానూ. అయితే ఒకడు తెలివైనవాడు. పనిశ్రద్ధ తక్కువ కానీ జీతం ఎక్కువడుగుతాడు. ఇంకొకడు తెలివితక్కువ వాడు. పనిశ్రద్ధ ఎక్కువ. జీతం తక్కువడుగు తాడు. ఎవరు కావాలో చెప్పు, పంపిస్తాను," అన్నాడు.

"యజమానికి తెలివివుంటే, పనివాడు తెలివితక్కువవాడైనా ఫర్వాలేదు. పనిశ్రద్ధ వుండి నమ్మకస్థుడైతే చాలు. జీతం కూడా తక్కువంటున్నావు కాబట్టి, అలాంటివాడినే పంపించు." అన్నాడు భూపతి.

ఆ విధంగా శంకరం, భూపతి ఇంట్లో పనికి చేరాడు. ఒక నెలరోజుల పాటు వాడి చేత పని చేయించుకున్నాక, ఆయనకెంతో తృప్తి కూడా కలిగింది. ఇలా వుండగా — ఒక రోజున పట్నంలో వుండే భూపతి కూతురు తండ్రికి ఉత్తరం పంపింది. అందులో ఇలా వుంది : "మా ఆడపడుచుకు పెళ్ళికుదిరింది. వియ్యాలవారు వంగపండు రంగు పట్టుచీర లడిగారు. రెండు కావాలి. వచ్చే శనివారం రోజుకు మాకు అందేలా పంపించగలరు. ఆలస్యం జరగకుండా చూడు."

ఉత్తరం తెచ్చిన మనిషి భూపతితో, "అయ్యా! ఈరోజు సాయంత్రమే నేనుతిరిగి పట్నం వెళ్ళిపోతున్నాను. చీరలు నాకిస్తే తీసుకుని వెళ్ళగలను," అన్నాడు.

భూపతి వాకబు చేయగా, బట్టలు నేసే వీరయ్య వద్ద వంగపండు రంగు పట్టుచీరలు లేవని తెలిసింది. రంగు మార్చటానికి రెండు రోజులు పడుతుందన్నాడు. ఆరోజు బుధ వారం. భూపతి ఉత్తరం తెచ్చినవాడితో, "శని

శ్రీరామకమల్



వంగపండు రంగు వేశాను. అదింకా పూర్తిగా ఆరలేదు. అయినా జాగ్రత్తగా పొట్లం కట్టాను. ఒక్కరోజు పాటు ఈ చీరలకు తడి తగల కుండా జాగ్రత్తపడండి," అని చెప్పి వెళ్ళాడు.

భూపతి వెంటనే శంకరాన్ని పిలిచి, "ఈ చీరలు వానలో తడవకూడదు. తడిశాయంటే రంగు మారిపోతుంది. కాబట్టి తగిన జాగ్రత్తలో తీసుకుని పట్నం వెళ్ళు," అని చెప్పాడు.

శంకరం చీరలు తీసుకుని, "వీటిమీద నీటిబొట్టు కూడా పడనివ్వను. నేను మాటంటే మాటే! ఇక ఇంటికి వెళ్ళి భోజనం చేసి ప్రయాణమై వెళ్ళిపోతాను," అని యజమాని వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆతర్వాత కాసేపు భూపతి, భార్య కూతురు గురించి ముచ్చటించుకున్నారు.

"ఆడపడుచు పెళ్ళికి వియ్యాలవారు కోరిన చీరలు అందజేసినందుకు, మనమ్మాయికి అత్తింట్లో మంచి పేరు వస్తుంది," అని భూపతి భార్య సంబరపడింది.

"సమయానికి శంకరంలాంటి నమ్మకస్థుడైన పనివాడున్నాడు కాబట్టి సరిపోయింది. అలా కాకపోతే, శనివారం ఉదయమే నేను ప్రయాణం కావలసి వుండేది. ఈమధ్య ప్రయాణాలు చేస్తే నాకు చాలా అలసటగా వుంటున్నదనుకో!" అన్నాడు భూపతి.

ఇంతలో పొరుగింట్లో ఏదో హడావుడి వినిపించింది. భూపతి, భార్య అక్కడికి వెళ్ళారు. భూపతి స్నేహితుడైన వెంకట్రాజు తండ్రి

వారానికల్లా అందేలా చీరలు పంపుతానన్నానని చెప్పు," అని పంపేశాడు.

తర్వాత ఆయన శంకరాన్ని పిలిచి పరిస్థితి చెప్పి, "ఎలాగో అలా శనివారానికల్లా పట్నం వెళ్ళి, అమ్మాయికి కనిపించాలి. గుర్తుంచుకో!" అన్నాడు.

"అంటే, శుక్రవారం రాత్రికల్లా నేను బయల్దేరాలి. అంతేకదా! నేను సిద్ధం," అని చెప్పాడు శంకరం.

గురువారం బాగానే గడిచింది కానీ శుక్రవారం నాడు వాన మొదలయింది. ఉదయం మొదలైన వాన చీకటిపడేదాకా తగ్గలేదు. వానతగ్గాక వీరయ్య పట్టుచీరలు తీసుకుని భూపతి ఇంటికి వచ్చి, "అయ్యా! చీరలకు

పేర్రాజుకు ఉన్నట్లుండి గుండెనొప్పి వచ్చింది. వైద్యుడు వచ్చి చూసి, "నా దగ్గర సరైనమందులు లేవు. వెంటనే పట్నం తీసుకెళ్ళండి," అని చెప్పాడు.

భూపతికి పట్నంలో చాలామంది పరిచయస్థులున్నారు. కూతురు కూడా అక్కడే వుంటున్నది. ఆయన వెంకట్రాజుకు సాయంగా వస్తానన్నాడు. అప్పటికప్పుడు బండి కట్టించుకుని వెంకట్రాజు కుటుంబం ప్రయాణమయింది. భూపతి కూడా వాళ్ళతో వెళుతూ, దారిలో శంకరం ఇంటిదగ్గర బండి నాపించాడు. కానీ అప్పటికే శంకరం పట్నం వెళ్ళిపోయినట్లు, ఇంటి యజమాని చెప్పాడు. భూపతి మనసులో, "నేనెలాగూ పట్నం వెళుతున్నాను గదా. శంకరం బయలుదేరకుండా కాసేపు ఆగివుంటే బాగుండేది," అనుకున్నాడు.

ఇప్పుడాయన శంకరాన్ని కలుసుకునే అవకాశం లేదు. వాడిది అడ్డదారి. బండి వెళ్ళే దారి వేరు. బండి చాలా వేగంగా పట్నం చేరుకుంది. భూపతి, వెంకట్రాజు తండ్రిని మంచి వైద్యుడికి చూపించాడు. ఆయన రోగిని పరీక్షించి ప్రమాదమేమీ లేదనీ, తన వద్ద రెండు రోజులుండాలనీ చెప్పాడు. ఈ ఏర్పాట్లు జరిగాక భూపతి, కూతురు ఇంటికి వెళ్ళాడు.

ఆమె తండ్రిని చూసి సంతోషించి, "అయ్యో! నువ్వెందుకొచ్చావు నాన్నా! చీరలు ఏ పని వాడిచేతనైనా పంపిస్తే సరిపోయేది," అన్నది.



అందుకు ఆమె మామగారు నొచ్చుకుని, "శుభకార్యానికి ఆయన కూడా రావడం మన అదృష్టం. ఎందుకొచ్చావని అడుగుతావేమిటి?" అంటూ కోడల్ని మందలించాడు.

భూపతి జరిగిందంతా కూతురికి చెప్పి, "అయితే, శంకరం ఇంకా రాలేదన్నమాట! కాలినడకగదా — మరికొంతసేపు పట్టవచ్చు. ఎలానూ వచ్చాను గనక, శుభకార్యం చూసి, ప్రయాణమవుతాను," అన్నాడు.

ఆతర్వాత కాసేపటికి శంకరం వచ్చాడు. వాడు వానలో బాగా తడిసి ముద్దయివున్నాడు. "వాన పడుతున్నది కదా. నువ్వు కాసేపు ఆగివుండవలసింది. అనుకోకుండా నాకు పట్నం ప్రయాణంపడింది," అన్నాడు భూపతి వాడితో.

"అయ్యా! నేను మాటంటే మాటే. శనివారం ఈపాటికి పట్నంవచ్చి అమ్మాయిగారిని కలుసుకుంటానన్నాక, వానలేకాదు, తుఫానులు కూడా నన్నాపలేవు," అన్నాడు శంకరం గర్వంగా.

"అది సరే కానీ. పట్టుచీరలు తడవకూడదని వీరయ్య మరీ మరీ చెప్పాడు కదా!" అన్నాడు భూపతి సంకోచంగా.

"మీరు చెప్పాక, వాటిని తడవనిస్తానా? చీరల మీద ఒక్క నీటి బొట్టయినా పడకుండా జాగ్రత్త తీసుకున్నాను," అన్నాడు శంకరం.

భూపతి ఆశ్చర్యపడి, "అదెలా సాధ్యపడిందో చెప్పు," అన్నాడు.

"తెలివుంటే ఏది సాధ్యం కాదు, బాబయ్యా! నేను బయల్దేరే సరికే చినుకులు పడుతున్నాయి. రెండు చీరల్నీ రేకుపెట్టెలో వుంచి మూత పెట్టాను," అన్నాడు శంకరం.

"మరి పెట్టె ఏది?" అని అడిగాడు భూపతి.

"ఎంత రేకుపెట్టయినా వానలో తడిస్తే, ఏ సందులో నుంచో లోపలికి నీళ్ళు వెళ్ళకపోవు గదా! అందుకని, ఆ పెట్టెను మాఇంట్లోమంచంకింద దాచాను," అన్నాడు శంకరం గొప్పగా.

వాడి మాటలు విని, ఆ ఇంట్లో వాళ్ళందరూ నవ్వగా భూపతికి తలతీసేసినట్లయింది. ఆయన అప్పటికప్పుడు బండి కుదుర్చుకుని, తన ఊరువెళ్ళి చీరలు తీసుకునివచ్చి శుభకార్యం జయప్రదంగా జరిగేలా చూశాడు.

తర్వాత భూపతి ఇంటికి తిరిగివస్తూనే చలపతిని కలుసుకుని, జరిగింది చెప్పి, "నువ్వు ముందు నన్ను హెచ్చరించావు. ఈ శంకరం నమ్మకస్థుడూ, పనిపట్ల శ్రద్ధ వున్నవాడే కాని, ఒట్టి తెలివితక్కువ వెధవ. అయినా నేను వాణ్ణి పనిలో నుంచి తీసి వెయ్యదలుచుకోలేదు. వాడి తెలివికి తగినట్టు వాణ్ణి పెరటిలో కూరపాదుల పెంపకం పనులకూ, పశువుల కాపలా పనులకూ ఉపయోగించుకుంటాను. తెలివైనవాడు కాస్త జీతం ఎక్కువ అడుగుతాడన్నావే, వాణ్ణి పంపు. అలాంటి వాడివల్ల పనులు, అనుకున్నవేళకు అనుకున్న విధంగా జరిగిపోతూంటాయి," అన్నాడు.

దీనికి చలపతి అవునన్నట్టు తలవూపి, భూపతి కోరిన పనివాణ్ణి ఆయన వద్దకు పంపాడు.






తమకు ఆశ్రయం ఇచ్చిన బ్రాహ్మణుడి కుటుంబంవారు ఎందుకేడుస్తున్నారో తెలుసుకుందామని కుంతీదేవి వచ్చినాక బ్రాహ్మణుడు దుఃఖంతో ఇలా విలపించసాగాడు:

"ఈ ప్రపంచంలో పెళ్ళాం, బిడ్డలతో సుఖంగా జీవించే మార్గం లేదు గద! ఈ దిక్కుమాలిన ఊరు వదిలిపోదామని నా భార్యతో ఎన్నడో అన్నాను. తాను ఇక్కడే పుట్టాననీ, ఇక్కడే పెరిగాననీ, తన కన్నవారికి దూరంగా పోలేననీ అన్నది. వాళ్ళా, ఏనాడో చనిపోయారు. ఈ ఊళ్ళోనైనా, బంధువన్న వాళ్ళు ఒక్కరూ లేరు. అయినా ఈ వూరు వదిలిపెట్టాము కాము! అప్పుడే నా మాట విన్నట్టయితే ఇప్పుడీ ఆపద వచ్చి పడేది కాదు. ఇప్పుడు మనం ఏం చేసేటట్టు? ఆ రాక్షసుడి వాత ఎవరిని వెయ్యను? ఇంత కాలమూ నాకు అనుకూలవతిగా ఉండి, నా వల్ల సంతానం కన్న నిన్ను రాక్షసుడి పొట్టన పెట్టనా? లేక వంశాంకురంగా పుట్టి పెరుగుతున్న మన కొడుకును పంపనా? కన్యాదానం చెయ్యవలసిన కూతురిని పంపనా? అందుచేత రాక్షసుడికి ఆహారంగా నేనే పోతాను. అంతకన్న మార్గం లేదు."

బ్రాహ్మణుడి భార్య ఇందుకు ఒప్పుకోలేదు. తన భర్త చనిపోతే తనకూ, పిల్లలకూ రక్షణ ఉండదనీ, తాము లోకులకు లోకువై పోతామనీ, పిల్లల భవిష్యత్తు తీర్చిదిద్దే శక్తి సామర్థ్యాలు తనకు లేవనీ, అందుచేత తానే రాక్షసుడికి ఆహారమవుతాననీ ఆమె అన్నది. ఆమె ఒక ఆశ కూడా కనబరచింది. అదేమి



టంటే, తాను ఆహారంగా వెళ్ళితే, స్త్రీహత్యకు జంకి రాక్షసుడు తనను విడిచిపుచ్చవచ్చునని!

ఈ మాట విని బ్రాహ్మణుడు తన భార్యను కౌగలించుకున్నాడు. ఇద్దరూ పెద్దగా ఏడవనారంభించారు. వాళ్ళను చూసి కూతురు, "మీరిద్దరూ ఎందుకు వృథాగా ఏడుస్తారు? రాక్షసుడికి నన్ను ఆహారంగా పంపెయ్యండి. నేనెలాగూ ఎప్పటికైనా మీకు దూరంగా వెళ్ళేదాన్నే గద! అందుచేత నన్ను పంపేస్తే మీకు కలిగే నష్టమేమీ లేదు. పైపెచ్చు మీకు ప్రమాదం తప్పిపోతుంది," అన్నది.

అప్పుడు అయిదేళ్ళ వయసుగల కుర్రవాడు చిన్న పుల్ల తీసుకుని, అటూ ఇటూ ఉత్సాహంగా తిరుగుతూ, వచ్చీరాని మాటలతో, "రాక్షసుణ్ణి నేను చంపేస్తానుగా! ఏడవకండి," అన్నాడు. వాడి మాటలకు పెద్దవాళ్ళు అంత దుఃఖంలోనూ నవ్వారు.

ఇదంతా వింటున్న కుంతి వారికి మరింత దగ్గరగా వచ్చి బ్రాహ్మణుడితో, "అయ్యా, మీకిప్పుడు వచ్చిన ఆపద ఏమిటి? నాకు వివరంగా చెప్పినట్టయితే చెయ్యదగిన సహాయంచేస్తాను," అన్నది.

దానికి బ్రాహ్మణుడు కుంతితో, "అమ్మా, మీ మంచితనం కొద్దీ మీరలా అన్నారు గాని, మాకు వచ్చిన విపత్తు మానవమాత్రులు తీర్చేది కాదు. ఈ నగరానికి సమీపంలో బకుడనే నరభక్షకుడొకడున్నాడు. వాడు రోజూ నరమాంసం తింటూ మదించి ఉన్నాడు. ఈ ఊరికి వాడు రక్షకుడుగా ఉంటున్నందుకు గాను, ఊరివాళ్ళు రోజుకొక ఇంటి వంతున ఆ రాక్షసుడికి ఇరవై బారువల అన్నమూ, రెండు ఎనుబోతులూ, ఒక మనిషీ పంపాలి. ఎవరన్నా అలా చెయ్యని రోజున ఆ రాక్షసుడు ఊరి మీద పడి ప్రజలను చెండుకు తింటాడు. ఈ దేశపు రాజు వేత్రకీయగృహ మనేచోట ఉంటున్నాడు. ఈ రాక్షసుడి బెడద నుంచి ప్రజలను కాపాడే ప్రయత్నమేదీ ఆయన చేయడు. ఆయన అసమర్థుడు. అసమర్థుడి పాలనలో ఉన్న మాకు రోజూ ఈ ఆపద ఉంటూనే ఉన్నది. ఇవాళ మా ఇంటి వంతు వచ్చింది. మాకే రాజాశ్రయం ఉండి, ధనవంతులమై ఉంటే

ఎవడినన్నా మనిషిని కొని, వాణ్ణి రాక్షసుడికి ఆహారంగా పంపి ఉందుము. మా కుటుం బానికి ఈ ఆపద తప్పదు. ఒకరిని విడిచి ఒకరం బతకలేము. నలుగురమూ ఒక్కసారే వెళ్లి ఆ రాక్షసుడికి ఆహారమవుతాం," అన్నాడు.

కుంతి ఈ కథ అంతా విని, "అయ్యా, మీరు నిశ్చింతగా ఉండండి. ఇవాళ ఆ రాక్షసుడికి ఆహారంగా నా కొడుకును పంపు తాను. వాణ్ణి రాక్షసుడు చంపలేడు. వాడే ఆ రాక్షసుణ్ణి చంపేస్తాడు. వాడు చాలా బలవం తుడు. అదీగాక వాడి దగ్గిర మంత్ర శక్తులు న్నాయి. అందుకే పంపిస్తున్నాను. ఏ తల్లి అయినా, నూరుగురు కొడుకులున్నప్పటికీ, తన కొడుకును మృత్యుదేవతకు చేజేతులా బలి చేస్తుందా? అందుచేత ఈ ఏర్పాటుకు ఒప్పుకోండి. ఈ సంగతి మాత్రం ఊళ్ళోఎవరికీ తెలియనివ్వకండి. వాడిగురువుగారికి తెలిసి, ఆయన వీలులేదన్నాడంటే, నా కొడుకు రాక్షసుణ్ణి చంపే అవకాశం పోతుంది," అన్నది.

కుంతి మాటలలో బ్రాహ్మణుడికి గురి కుదిరింది. ఆయనకు ఆపద తప్పిందన్న ఆనందమూ, కుంతి తనకు మహోపకారం చేసినందుకు కృతజ్ఞతా కలిగాయి. కుంతి భీముడితో సంగతంతా చెప్పింది. భీముడు తల్లి చేసిన ఏర్పాటుకు సమ్మతించాడు.

ఇంతలో మిగిలిన నలుగురు పాండవులూ భిక్ష తీసుకుని ఇంటికి తిరిగివచ్చారు. భీముడు మహా ఆనందంలో ఉండటం గమనించి



ధర్మరాజు కుంతిని భీముడి ఆనందానికి కారణమేమిటని అడిగాడు. కుంతి అతనితో సంగతంతా చెప్పి, "ఇన్నాళ్ళకు మనం ఇల్లు గల బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చేసే అవకాశం దొరికింది," అన్నది.

ఈ మాట విని ధర్మరాజు చాలా బాధప డ్డాడు; తమ తల్లి తొందరపడిందనుకున్నాడు. పాండవుల ఆశలన్నీ, భవిష్యత్తు అంతా భీముడి భుజబలం మీదే ఆధారపడి ఉన్న సంగతి అతనికి తెలుసు. రేపు వారు కౌరవు లను జయించి తమ రాజ్యం తాము తీసుకో దలిస్తే భీముడులేకుండాఎలాసాధ్యం? దుర్యో ధనుడు కుట్రతో తమనందరినీ లక్కయింట కాల్చి చంపటానికి యత్నించినప్పుడు అంద

రినీ ఆపద నుంచి తప్పించటం ఒక్క భీముడి వల్ల అయిందిగాని మరొకరి వల్ల సాధ్యమా? ధర్మరాజు ఈ ధోరణిలో మాట్లాడుతూ ఉంటే కుంతీదేవి వ్యతిరేకించింది. ఆర్తులను రక్షించటం ఉత్తమ క్షత్రియ ధర్మం. ఈ బ్రాహ్మణ కుటుంబానికి ప్రత్యుపకారం చెయ్యలేకపోతే అది మహాపాతకం. భీముడికి వచ్చిన భయమేమీ లేదు. అతను ఎలాటి రాక్షసుడినైనా చంపగలడు. తాను చేసిన ఆలోచన ఇహానికీ, పరానికీ కూడా పనికివచ్చేదని ఆమె అన్నది. ధర్మరాజు తల్లి అభిప్రాయంతో చివరకు ఏకీభవించక తప్పలేదు.

తెల్లవారగానే భీముడు ఇల్లుగల బ్రాహ్మణుడితో, "అయ్యా, తెల్లవార్లూ నాకు నిద్రలేదు. ఆకలి దహిస్తున్నది. మంచి ఆహారంకడుపునిండా పెట్టించారంటే రాక్షసుడితో ఉత్సాహంగా పోరాడతాను," అన్నాడు. బ్రాహ్మణుడు అతనికి తిన్నంతగా భక్ష్యభోజ్యాలూ, పానీయాలూ, నెయ్యీ, పెరుగూ పెట్టించాడు.

తరవాత భీముడు ఒక బండికి రెండు దున్నలను కట్టి, బండి నిండా అన్నపురాసులు పోసుకుని, నగరానికి దక్షిణంగా వెళ్ళి, బకుడుండే చోటికి చాలాదూరంగా, యమునానది ఒడ్డున బండి నిలిపి, తన దగ్గరికి రమ్మని బకుణ్ణి కేకలుపెట్టి, వాడు వచ్చేలోగా ఊరికే ఉండటం దేనికని బండిలో ఉన్న ఆహారాన్ని తింటూ కూర్చున్నాడు.

ఒక సామాన్య మానవుడు తనను పిలుస్తూ ఉండటం చూసి బకుడు మండిపడి పరిగెత్తుకుంటూ వచ్చి, తన కోసం ఏకచక్రపురం



వాళ్ళు పంపిన అన్నాన్ని భీముడు పెద్ద పెద్ద ముద్దలు చేసి మింగుతూండటం చూసి, "ఎవడురా వీడు? చావబోతూ కూడా నిశ్చింతగా మెక్కుతున్నాడు!" అన్నాడు.

భీముడు బకుడి కేసి చూసి ఒక నవ్వు నవ్వి తిరిగి యథాప్రకారం తన తిండిలో నిమగ్నుడయ్యాడు. బకుడు పెద్ద పెడబొబ్బ పెట్టి, భీముణ్ణి చంపేవాడల్లే రెండు చేతులూ ఎత్తి భీముడి మీదికి వచ్చాడు. దానికి కూడా భీముడు చలించక, బండిలోని అన్నం తింటున్నాడు. తన పెడబొబ్బకు కూడా ఆ మనుష్యమాత్రుడు చలించక పోవటం చూసి బకుడు భీముడి వీపును తన రెండు చేతులతోనూ చరిచాడు. దాన్ని కూడా భీముడు లక్ష్యపెట్టక, తిండి పూర్తిచేసి, వెళ్లి నదిలో చేతులూ, కాళ్ళూ కడుక్కొంటున్నాడు. బకుడు ఆగ్రహావేశంతో ఒక చెట్టు పీకి, భీముడి కేసి విసిరాడు. భీముడు కడుపునిండా నీరుతాగి బకుడితో యుద్ధానికి సన్నద్ధుడై వచ్చాడు. బకుడు విసిరిన చెట్టు భీముడి చేతిలో ఉన్నది. వాడు మరో చెట్టు పీకి విసిరేసరికి భీముడు తన చేతిలో ఉన్న చెట్టును దానికి అడ్డం పెట్టి ఆపాడు. చుట్టుపక్కల ఉన్న చెట్లన్నీ అయిపోయే దాకా ఇద్దరూ ఈ విధంగా చెట్లతో యుద్ధం చేసుకున్నారు. తరవాత బకాసురుడు తన చేతులతో భీముణ్ణి పట్టుకున్నాడు. ఇద్దరూ మల్లయుద్ధం చేస్తూ ఒకరినొకరు విసిరివేశారు, జరజరా ఈడ్చారు.




చివరకు భీముడు బకాసురుణ్ణి పడదోసి, మీద ఎక్కి కూర్చుని, భూమికి అదిమిపెట్టి, మోకాళ్ళతోనూ, మోచేతులతోనూ కుమ్ముతూ, మెడా, నడుమూ, వీపూ విరగ బొడిచాడు. బకాసురుడు భయంకరంగా నెత్తురు కక్కుతూ చచ్చాడు.

వాడు పెట్టిన చావుకేక విని వాడి బంధువులు వచ్చారు. భీముడు వాళ్ళను చూసి, "ఇకముందు మీలో ఎవరన్నా తిండి కోసం మనుషులను చంపారంటే, వాళ్ళకు కూడా ఈ బకుడికి పట్టిన గతే పట్టుతుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

వాళ్ళు వణికిపోతూ తమ తమ చోట్లకు వెళ్ళిపోయారు.

భీముడు బకుడి శవాన్ని ఈడ్చుకు వచ్చి నగరద్వారం దగ్గిర పెట్టి, నదిలో స్నానం చేసి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయి, జరిగిన సంగతి ధర్మరాజుకు తెలిపాడు.

బకుడి శవం ఊరివారి కంట పడింది. రాక్షసుడు మరణించాడన్న వార్త ఊరంతా పాక్కింది. వాణ్ణి చంపినదెవరో ప్రజలకు తెలియదు. కాని ఆ పుణ్యాత్ముణ్ణి తెగమెచ్చుకుని, తమ ఇష్టదేవతలకు దణ్ణాలు పెట్టుకున్నారు. బకుడు చచ్చిననాడు వంతు బ్రాహ్మణుడి ఇంటిదని తెలియగానే అందరూ బ్రాహ్మణుడి వద్దకు వెళ్లి, బకుణ్ణి ఎవరు చంపారని అడిగారు.

తన ఇంట తలదాచుకునే వారిని గురించి బయట పెట్టటానికి వీలులేని కారణంచేత బ్రాహ్మణుడు నగర పౌరులతో, "నిన్న మా ఇంటి వంతు వచ్చింది. నేను పుట్టెడు విచారంతో మునిగి ఉండగా ఒక యోగసిద్ధుడు వచ్చి, సంగతి విని రాక్షసుడికి ఆహారం తాను తీసుకుపోతాననీ, తనను రాక్షసుడేమీ చేయలేడనీ అన్నాడు. మరి రాక్షసుడు చచ్చాడంటే ఆ మహాత్ముడే ఆ పుణ్యం కట్టుకుని ఉండాలి," అన్నాడు.

ఊరి ప్రజలు పరమానందంతో బ్రాహ్మణోత్సవం చేశారు. కుంతీ, పాండవులూ కూడా ఆ వేడుక చూశారు. వాళ్ళు ఆ బ్రాహ్మణుడి ఇంటనే, అలాగే అజ్ఞాత జీవితం గడుపుతూ వచ్చారు. వారు మధుకరంతోనే జీవించారు.

ఇలా ఉండగా పాండవులుంటున్న బ్రాహ్మణ గృహానికి ఒక దేశసంచారి అయిన బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి, గృహస్థు ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించి, తాను తిరిగిన దేశాలను గురించీ, అక్కడి రాజులను గురించీ అనేక వార్తలు సరదాగా చెప్పుకుపోయాడు. అతను ఒక సందర్భంలో, పాంచాలదేశపు రాజైన ద్రుపదుణ్ణి గురించీ, ఆయనకు శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ పుట్టటం గురించీ, ద్రౌపదీ స్వయంవరానికి జరిగిన ఏర్పాట్లను గురించీ క్లుప్తంగా చెప్పాడు. అప్పుడు కుంతీదేవీ, పాండవులూ కూడా ఆ వృత్తాంతాలను వివరంగా వినగోరారు. అందుచేత బ్రాహ్మణుడు చెప్పడం ప్రారంభించాడు.



# ఐకమత్యం!

వీరభద్రయ్య అనే అతను, పొరుగూళ్ళో వున్న తన మిత్రుడు రామేశాన్ని చూసేందుకు వెళుతూ, మార్గ మధ్యంలో జరుగుతున్న ఒక సంతలోని దుకాణంలో రెండు పటాలు కొన్నాడు. అందులో ఒకటి శివుడి పటం, రెండవది విష్ణుపటం.

మిత్రుడి ఇల్లు చేరగానే వీరభద్రయ్య, "ఒరే, రామేశం! నీకు బహూకరించాలని కొని తెచ్చాను," అంటూ పటాలను రామేశానికిచ్చాడు.

రామేశం మహదానందంగా వాటిని తీసుకుని, గూటిలోనుంచి రెండు మేకులను వెదికి తీసి పదేళ్ళ కొడుకు బుజ్జితో, "ఒరే, బుజ్జీ! పక్కింటికి వెళ్ళి సుత్తి తీసుకురా. గోడకు మేకులు కొట్టి పటాలు తగిలిద్దాం," అన్నాడు.

బుజ్జి పక్కింటికి వెళ్ళి తిరిగి వస్తూనే, "వాళ్ళింట్లో సుత్తి లేదన్నారు, నాన్నా!" అని చెప్పాడు.

"అలా అయితే, ఎదురింటి నారాయణ నడుగు," అన్నాడు రామేశం.

అక్కడా లేదన్నారంటూ బుజ్జి తిరిగి వచ్చి చెప్పాడు. రామేశం విసుక్కుని, మరి రెండు మూడిళ్ళకు కొడుకును పంపాడు. ఆ ఇళ్ళవాళ్ళూ సుత్తి లేదన్నారు.

దానితో రామేశం ఆగ్రహం తెచ్చుకుని వీరభద్రయ్యతో, "చూశావా, భద్రం మా ఊరి వాళ్ళతంతు. నేనిప్పుడు బుజ్జిని పంపిన అందరి ఇళ్ళల్లోనూ సుత్తి వుంటుంది. కానీ ఎవ్వరూ ఇవ్వరు. ఇలా అయితే మనలో ఐకమత్యం ఎలా వుండి చస్తుంది?" అన్నాడు.

వీరభద్రయ్య తలూపి వూరుకున్నాడు. అప్పుడు రామేశం, కొడుకుతో, "సరే, ఎవ్వరూ ఇవ్వకపోతే ఏంచేస్తాం! వెనకగదిలోని పాతభోషాణంలో మన సుత్తేవుంది, పట్టుకురా," అన్నాడు.

ఇది విని వీరభద్రయ్య తెల్లబోయాడు.

— కె. హనుమంతరావు



| చందమామ అనుబంధం - 79 | మన దేశపు చెట్లు |
|---|---|

# మర్రిచెట్టు

మనదేశంలో మర్రిచెట్టు లేని గ్రామం అంటూ ఉండదని చెప్పవచ్చు. ఊరు బయట కనిపించే ఈ చెట్టు మనుషులకూ, గొడ్డూ గోదకూ చల్లటి నీడనిస్తుంది. కొమ్మల నుంచి వచ్చే వేళ్ళు ఊడలుగా వేలాడుతూ ఉంటాయి. పర్షియన్ సింధుశాఖ వద్ద ఉన్న ఒక బ్రహ్మాండమైన మర్రి వృక్షం కింద మనదేశం నుంచి వెళ్ళే వ్యాపారులు (బనియాలు) రోజుల తరబడి విశ్రాంతి తీసుకునే వారు. అందుకే ఆ వృక్షానికి పర్షియను భాషలో 'బానియన్' అని పేరు వచ్చింది. హిందీలో దీనిని 'బోర్' అనీ 'బేర్' అనీ, మరాఠీలో 'వార్' అనీ, తమిళంలో 'ఆల' అనీ, మలయాళంలో 'పేరల్' అనీ అంటారు. ఇంగ్లీషులో దీనిని 'ఇండియన్ ఫిగ్' అని అంటారు.

పూర్వకాలంలో సంతానం లేని దంపతులు జ్యేష్ఠ మాసంలో అమావాస్య రోజున మర్రిచెట్టును పూజించే వాళ్ళు. భర్త సత్యవంతుడి ప్రాణాలు రక్షించుకోవడానికి సావిత్రి మర్రిచెట్టును పూజించిందని చెబుతారు. సృష్టి అంతంలో జలప్రళయం ఏర్పడేప్పుడు నీళ్ళ మీద తేలే వటపత్రం మీద మహావిష్ణువు శిశువులా శయనిస్తాడని భక్తులు విశ్వసిస్తారు. ఈ రోజులలో 'వటపత్రశాయి' అయిన బాలకృష్ణుడి చిత్రాలు బాగా అమ్ముడవుతాయి!

కలకత్తా సమీపం సిబ్‌పూర్ బొటానికల్ గార్డన్స్‌లోని మర్రివృక్షం, మద్రాసు అడయార్ థియొసాఫికల్ సొసైటీ ప్రాంగణంలోని మర్రివృక్షం, బీహార్ రాష్ట్రం గోప్‌పూర్‌లోని బ్రహ్మాండమైన గొడుగులా కనిపించే మర్రి వృక్షం; అదే రాష్ట్రంలో కాట్మైలో మూడు ఎకరాలకు విస్తరించి వున్న మర్రి వృక్షం చాలా ప్రసిద్ధి గాంచినవి.



మర్రి ఆకులు పెద్దవిగా అండాకారంలో దళసరిగా వుంటాయి. ఫిబ్రవరి-మార్చి నెలలలో చివురిస్తాయి. పూత వెలుపలికి కనిపించదు. చిన్న చిన్న కాయలు జతలు జతలుగా కాస్తాయి: బాగా పండినప్పుడు ఎర్రగాతయారై రకరకాల పక్షులను ఆకర్షిస్తాయి.

మర్రిచెట్టు శతాబ్దాల తరబడి బతుకుతుంది.

మనదేశపు ఋషులు : 3

# నారదుడు



దైవాన్నీ, దైవసృష్టినీ గాఢంగా ప్రేమించిన ఋషి పుంగవుడు నారదుడు. ఆయన బ్రహ్మపుత్రుడు; మహావిష్ణువు భక్తుడు. మహతిఅనే తన వీణ మీటుతూ, నిరంతరం నారాయణనామం గానం చేస్తూ తరించిన మునిశ్రేష్ఠుడు.

మనిషికి మంచిని కాంక్షించిన వారిలో నారదుడు ముఖ్యుడు. తాను విష్ణువు నుంచి నేర్చిన విద్యను అర్హులయిన మానవులకు బోధించాడు.నారాయణ నామాన్ని గానంచేస్తూ, త్రిలోకాలలోసంచరిస్తూ మంచి వారికి చేతనైన ఉపకారం చేసేవాడు.

మానవులందరిలోకీ మహోదాత్త చరిత్ర కలిగిన వాడు ఎవరని వాల్మీకి అడిగినప్పుడు, నారదుడు ఆయనకు శ్రీరాముణ్ణి గురించి చెప్పాడు. ఆయన మాటలతో ప్రేరణ పొందిన వాల్మీకి, తమసానదీ తీరంచేరి, రామాయణ మహాకావ్య రచనకు ఉపక్ర మించాడు.

పాండవులు నూతన నగరం నిర్మించాలనుకు న్నప్పుడు నారదుడు వారికి తాను చూసిన దివ్య నగ రాలయిన ఇంద్రపురినీ, కుబేరపురినీ కళ్ళకు కట్టి నట్టు వర్ణించాడు. దానిని అనుసరించే పాండవులు తమ రాజధానీ నగరం ఇంద్రప్రస్థాన్ని నిర్మించారు.

నారదుడు కలహప్రియుడని అంటారు. అయితే, ఇదొక అపోహ మాత్రమే. నారదుడు పైకి కలహ భోజనుడుగా కనిపించినప్పటికీ, ఆయన ఆశయం మాత్రం లోకకల్యాణమే. చెడును మంచి జయించ డానికీ, అధర్మాన్ని ధర్మం జయించడానికీ నారదుడి కలహప్రియత్వం దోహదం చేసేది. ఉదాహరణకు, బాలకృష్ణుడు ఎక్కడ పెరుగుతున్నాడో తెలియక కంసుడు తపిస్తున్న సమయంలో, అతని ఆచూకీ కాస్తా నారదుడు చెప్పేశాడు.దాంతో రెచ్చిపోయిన కంసుడు, కృష్ణుణ్ణి హతమార్చడానికి తొందరపడి, తానే హతుడైపోయాడు. ఆ విధంగా కంసుడి పీడ త్వరగా విరగడై, భూమి మీద అతడి దారుణకృత్యాలు అంతం కావడానికి నారదుడి కలహప్రియత్వం దోహదం చేసింది!

రావణుడి మరణానికి కూడా ఒకవిధంగా నార దుడే కారణం అని చెప్పవచ్చు. ఒకసారి రావణుడు నారదుణ్ణి, ఓంకారానికి అర్థం ఏమిటో వివరించ మన్నాడు. దానిని తెలుసుకునే అర్హత రావణుడికి లేదని భావించి, నారదుడు చెప్పనన్నాడు. రావణుడికి ఆగ్రహం వచ్చింది. నారదుడి నాలుకను తెగకోయాల నుకున్నాడు. అప్పుడు నారదుడు, రావణుడి పది తలలూ త్వరలో తెగి పడగలవని శపించాడు.

నారదుడికి జ్ఞాన పిపాస ఎక్కువ. ఒకనాడాయన మహావిష్ణువును–ప్రపంచ సృష్టికి ఆధారం మాయ అని అంటారుకదా, మరి మాయ అంటే ఏమిటి? అని ప్రశ్నించాడు. అది మునుముందు నీకే అనుభవంలోకి వస్తుందని విష్ణువు నారదుడికి చెప్పాడు. ఒకనాడు నారదుడు యథాప్రకారం భూలోక సంచారం చేస్తూ, ఒక గ్రామం గుండా వెళుతూండగా ఉన్నట్టుండి పెద్ద వర్షం ప్రారంభమయింది. ఆయన తలదాచుకోవడానికి ఒక ఇంటి తలుపు తట్టాడు. అందమైన ఒక యువతి వచ్చి తలుపు తెరిచింది. ఆమె తల్లిదండ్రుల కోరికపై, నారదుడా యువతిని పెళ్ళాడి అక్కడే ఉండిపోయాడు. పలువురు పిల్లలకు తండ్రి అయ్యాడు. సంసార జీవితంలోని సుఖదుఃఖాలన్నిటినీ అనుభవించాడు. ఒకనాటి రాత్రి హఠాత్తుగా ఏరు పొంగి వెల్లువ వచ్చి ఆయన ఇంటిని చుట్టుముట్టింది. భార్యాపిల్లలు ప్రవాహంలో కొట్టుకుపోయారు. నారదుడు దుఃఖాన్ని భరించలేక కిందపడి పొర్లుతూ, "అయ్యో, నా భార్యా పిల్లలు పోయారే!" అని ఏడ్చి ఏడ్చి ఆఖరికి, "నారాయణా! నన్ను రక్షించు!" అన్నాడు.

మరుక్షణమే అతని ఎదుట విష్ణువు ప్రత్యక్షమై, "నారదా! నువ్వు త్రిలోక సంచారివి కదా! నీకు భార్యా పిల్లలేమిటి?"అని అడిగాడు.

మాయ అంటే ఇదే అని గ్రహించిన నారదుడు విష్ణువుకుచేతులెత్తి నమస్కరించి నోరార స్తుతించాడు!

వివాహమై యేడాది పూర్తయ్యేలోగా సత్యవంతుడి ఆయుస్సు తీరిపోతుందని సావిత్రినీ, ఆమె తండ్రి అశ్వపతినీ ముందుగానే హెచ్చరించినవాడు కూడా నారదుడే. ఆ హెచ్చరిక వల్లనే సావిత్రికి యముణ్ణి ఎదిరించి, తన భర్త ప్రాణాలు దక్కించుకోవడానికి కావలసిన మనోస్థైర్యాన్ని సమకూర్చుకోవడానికి తగిన అవకాశం ఏర్పడింది.

ఇటువంటి మన పురాణకథలెన్నిటితోనో ఆసక్తికరమైన సంబంధం కలిగిన ముని నారదుడు. మన భక్తి సాహిత్యంలో నారద భక్తిసూత్రాలకు సమున్నతమైన స్థానం ఉన్నది.



# మీకు తెలుసా?

1. ప్రపంచంలో అత్యధికంగా నూనె ఉత్పత్తి చేసే దేశం ఏది?
2. 'ఇండియాస్ షేక్స్‌పియర్' అని ప్రసిద్ధిగాంచిన నాటక కర్తఎవరు?
3. గ్రీన్‌ల్యాండ్ ఏ దేశంలోని భాగం?
4. టిబెట్‌లో పుట్టి, హిమాలయాల గుండా ప్రవహించి సముద్రంలో సంగమించే ముందు గంగా నదిలో కలిసే నది ఏది?
5. గడ్డిజాతికి చెందిన అతి పెద్ద మొక్క ఏది?
6. మనదేశం 'ఏడుదీవులనగరం' అని ఏ నగరాన్ని పిలుస్తారు?
7. రేడియోను కనుగొన్న వారెవరు?
8. 'రామ్ చరిత్ మానస్' గ్రంథకర్త ఎవరు?
9. 'అర్థికశాస్త్ర పిత'గా ఎవరిని చెబుతారు?
10. అక్బర్‌ను వివాహమాడిన రాజపుత్ర యువరాణి ఎవరు?
11. మలేరియాను నయంచేసే 'క్వినైన్'ను ఏ చెట్టు బెరడు నుంచి తీస్తారు?
12. దక్షిణ భారత దేశంలోని ఒక నగరంలో 'బ్రిటిష్ ఆర్మీ' ప్రధాన కార్యాలయాలు ఉండేవి. ఆ నగరం ఏది?
13. ఇండోనేషియా ద్వీపమైన సుమత్రాకు గల మరొక ప్రసిద్ధ స్థానిక నామం ఏది?
14. క్రికెట్ టెస్ట్ మేచ్‌లో పాల్గొన్న వారిలో ఎక్కువవయసుగల వారెవరు?
15. 1498వ సం॥లో కేప్ ఆఫ్ గుడ్‌హూప్, ద్వారా ఇండియాకు మార్గం కనుగొన్నవారెవరు?
16. రామాయణంలో లక్ష్మణుడి భార్య పేరేమిటి?
17. బెర్లిన్ ఏ నదీ తీరంలో ఉన్నది?
18. మొట్టమొదటి ప్రపంచ అన్వేషకుడు ఈజిప్టుకు చెందినవాడు. ఆయన పేరేమిటి?

## సమాధానాలు

1. రష్యా.
2. కాళిదాసు.
3. డెన్మార్క్.
4. బ్రహ్మపుత్ర.
5. వెదురు.
6. బొంబాయి.
7. జి. మార్కోని.
8. తులసీదాసు.
9. ఆడమ్ స్మిత్.
10. జోధాబాయ్.
11. సింకోనా.
12. బెంగళూరు.
13. జావా మైనర్.
14. ఇంగ్లాండుకు చెందిన డబ్ల్యు. రోడ్స్ (52 సం॥).
15. వాస్కో డా గామా.
16. ఊర్మిళ.
17. స్ప్రీ నది.
18. హెన్నా.



# బ్రహ్మయ్య దిగులు

నందవరం అనే ఊళ్ళో ఉండే బ్రహ్మయ్య చాలా మంచివాడు. ఇరుగుపొరుగులకు సాయపడడంలోనే ఆయనకు ఆనందం ఎక్కువ. ఆవిధంగా ఆయన ఎందరికో సాయపడ్డాడు. కానీ ఆయనవల్ల సాయం పొందిన వాళ్ళు ఆయనతో మంచిగా వుండడం లేదు. అందువల్ల బ్రహ్మయ్య ఎప్పుడూ దిగులుగా వుండేవాడు.

వాణి బ్రహ్మయ్యకు అనుకూలవతి అయిన భార్య. ఆమె, భర్త దిగులుగా వుండడాన్ని భరించలేకపోయేది. ఆమె బ్రహ్మయ్యతో, "ఇతరులకు సాయపడడం వల్ల నీకు సంతోషంకంటే దిగులే ఎక్కువ కలుగుతున్నది. ఇకనుంచి నీ బ్రతుకేదో నువ్వు బ్రతుకు. ఇతరుల గురించి పట్టించుకోకు," అని తరచుగా చెబుతూండేది.

ఇలా వినీవిని కొన్నాళ్ళకు బ్రహ్మయ్య, పెళ్ళాం చెప్పినట్టు చేయాలన్న గట్టి నిర్ణయానికి వచ్చాడు. ఇలాంటి సమయంలో, బ్రహ్మయ్య ఎదురింట్లో వుండే శివయ్య పట్నానికి తరలి వెళుతూ, తన ఇల్లు అమ్మిపెట్టే బాధ్యతను బ్రహ్మయ్యకు అప్పగించాలనుకున్నాడు.

అయితే బ్రహ్మయ్య, "నేనెవరికి సాయపడినా వాళ్ళతో గొడవలొస్తున్నాయి. ఊరొదిలి వెళ్ళిపోతున్న నీతో అలా జరగడం ఇష్టం లేదు. ఏమీ అనుకోక ఈ పని ఇంకెవరికైనా అప్పజెప్పు!" అని శివయ్యకు ఖచ్చితంగా చెప్పేశాడు.

శివయ్య నవ్వి, "సరే! ఇంటికి తాళం పెట్టి వెళతాను. నీ మంచితనంగురించి నాకు బాగా తెలుసు కాబట్టి నిన్నపార్థం చేసుకోను. ఎవరైనా ఇల్లు కావాలంటూ వస్తే, వాళ్ళకు పత్రం రాసిచ్చి పట్నం పంపు. బేరసారాలన్నీ నావేలే. కానీ నువ్వు పత్రం రాసిచ్చిన వారికే ఇల్లమ్ముతాను," అని పట్నం ప్రయాణమయ్యాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



ఆతర్వాత కొన్నాళ్ళకు బ్రహ్మయ్య బావ మరిది భీముడు, తన మకాం పొరుగూరి నుంచి ఆ ఊరుకు మార్చాలనుకున్నాడు. అందువల్లవాడుశివయ్యఇల్లుకొనాలనుకు న్నాడు. కానీ బ్రహ్మయ్య భీముడికి పత్రంరా సివ్వలేదు.తనవాళ్ళకు సాయపడితే శివయ్య అపార్థం చేసుకుంటాడని ఆయన భయం.

"బావా! ఇలాంటిల్లు మళ్ళీ దొరకదు. ఇది బంగారంలాంటి అవకాశం. మనం ఎదు రెదుగా వుండొచ్చు. నువ్వు పత్రం రాస్తే - ఆ శివయ్య ఎంతడిగితే అంతా ఇచ్చి, ఆ ఇల్లు కొంటాను," అని భీముడు చెప్పాడు.

బ్రహ్మయ్య పత్రం రాసివ్వడానికి ఒప్పుకోక, "నువ్వు నా భార్యకు స్వయానా తమ్ముడివి. నాకు నాలుగు కుటుంబాలకు సరిపడే పెద్దిల్లు న్నది. నిన్ను వేరే ఇంట్లో వుండనిస్తానా? మనం కలిసి వుందాం, సరేనా?" అన్నాడు.

బావ మనస్తత్వం తెలిసినా, ఇల్లు తనకు దక్కనందుకు ఉక్రోషం వచ్చి భీముడు ఈ ఊరుకు మకాం మార్చే ఆలోచన మానుకు న్నాడు.

ఆ తర్వాత గోపయ్య అనేవాడు బ్రహ్మయ్య వద్దకు వచ్చి, "అయ్యా! పేదవాణ్ణి. ఇల్లు కొందామంటే ఒక్కసారి డబ్బిచ్చుకోలేను. నువ్వుపత్రంరాసిచ్చినవాడికి శివయ్య కాదన కుండా ఇల్లమ్ముతాడని తెలిసింది. నువ్వు దయ తలిస్తే, నా కుటుంబం నీకు ఋణపడి వుంటుంది," అన్నాడు.

మామూలుగా ఎవరైనా డబ్బిచ్చి ఇల్లుకొంటే అది వేరే సంగతి. అలాకాక, వాయిదాల పద్ధతి మీద ఇల్లుకొనుక్కునేందుకు పత్రం రాసిస్తే, తను గోపయ్యకు సాయపడినట్లే అవుతుంది. అందుకని బ్రహ్మయ్య ఆలోచ నలో పడ్డాడు. మళ్ళీ వస్తానని గోపయ్య వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి గోపయ్య భార్య రుక్మిణి వచ్చి, బ్రహ్మయ్య భార్య వాణిని కలుసుకుని, "నా భర్త గుండె జబ్బు మనిషి. ఇంటికోసం బెంగపెట్టుకున్నాడు. సొంత ఇల్లుంటే దిగులు పోయి జబ్బు నయమవుతుందని వైద్యుడు చెప్పాడు. గుండెజబ్బు మనిషనీ, ఏ క్షణంలో ప్రాణం గుటుక్కుమంటుందోననీ భయపడి,

మమ్మల్ని అద్దె ఇంట్లోంచి పొమ్మంటున్నారు. ఇంకెవరూ మాకు ఇల్లివ్వమంటున్నారు. నీ భర్త సాయపడితే మాకు ఒక సొంతఇల్లు ఏర్పడుతుంది. నా భర్త ప్రాణాలు, నీ భర్త చేతుల్లోవున్నాయి," అంటూకళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

ఇది విన్న వాణి జాలిపడి, గోపయ్యకు పత్రం రాసివ్వమని భర్తను బలవంత పెట్టింది. బ్రహ్మయ్య, గోపయ్యకు పత్రం రాసిచ్చాడు. గోపయ్య పట్నం వెళ్ళి రెండు రోజుల్లో తిరిగి వచ్చి బ్రహ్మయ్యతో, "నువ్వు మంచి వాడివే కానీ, నీ స్నేహితుడు డబ్బు మనిషి. ఇల్లు వెయ్యి వరహాలు. రెండే రెండు వాయిదాల్లో మొత్తం డబ్బు కట్టేయాలట. మనిషి మర్యాద లేకుండా మాట్లాడాడు. అద్దెఇంట్లో కాకపోతే చెట్టుకిందనైనా చస్తానుగానీ, ఈ ఇల్లు మాత్రం కొనననని శపథం చేసి వచ్చేశాను," అన్నాడు.

గోపయ్య అసలే గుండెజబ్బు మనిషి, ఏమైపోతాడోనని బ్రహ్మయ్య భయపడి, ఆఇల్లెంత మంచిదో వాడికి నచ్చజెప్పాలని చూశాడు. నువ్వు వద్దంటే ఇంకా ఎక్కువ డబ్బిచ్చి కొనడానికి, నాబావమరిది సిద్ధంగా వున్నాడని భయపెట్టాడు.

దానితో గోపయ్య మెత్తపడ్డాడు. బ్రహ్మయ్య, వాడి పరిస్థితి అంతా తెలియబరుస్తూ, శివయ్యకు పత్రం రాసిచ్చాడు. ఆతర్వాత గోపయ్య పట్నంవెళ్ళివచ్చాడు. ఏమయిందోవాడు బ్రహ్మయ్యకు చెప్పలేదు. అలా కొద్ది రోజులు గడి



చాక గోపయ్య, శివయ్య ఇల్లు కొన్నట్టు ఊళ్ళో చెప్పుకోసాగాడు. కొందరు గోపయ్యకు సాయపడినందుకు బ్రహ్మయ్యను మెచ్చుకున్నారు.

ఇల్లు కొని వుంటే గోపయ్య మాటవరుసకా విషయం తనతో అని వుంటాడని భావించిన బ్రహ్మయ్య, ఉండబట్టలేక ఏదో విధంగా విషయంతెలుసుకోవాలని, ఒక రోజున గోపయ్య కుటుంబాన్ని తన ఇంటికి విందు భోజనానికి పిలిచాడు. వాళ్ళు వచ్చి విందారగించారే తప్ప ఇంటి గురించిఒక్క మాట కూడా అనలేదు.

అయితే, గోపయ్య ఇల్లు కొన్న మాట నిజం! గృహప్రవేశానికి భారీఎత్తునఏర్పాట్లు చేస్తున్నాడు. బ్రహ్మయ్యలో మళ్ళీ దిగులు ప్రారంభమైంది. అది చూసి వాణి, "ఈసారి



సాయానికి పురిగొల్పిన తప్పునాది. అందుకు నువ్వు శిక్ష అనుభవిస్తున్నావు. మనం తెలివి తక్కువ వాళ్ళం. అందువల్లనే మన నుంచి సాయం పొందిన వాళ్ళు మన మనసుల్ని అకారణంగా కష్టపెడుతున్నారు. దీనికేం చేయాలో మనకు తెలియదు. ఆ తెలివి నా తమ్ముడికుంది. అవసరానికి మన చుట్టూ తిరిగి, అవసరం తీరాక మన మొహం చూడని ఇలాంటి వాళ్ళతో ఎలా వ్యవహరించాలో వాడికి బాగా తెలుసు. వాణ్ణి కొన్నాళ్ళ పాటు మనింట్లో వుండమందాం," అన్నది.

ఇందుకు బ్రహ్మయ్య చిరాగ్గా, "వాడిని మనతో వుండమని ఎప్పుడో చెప్పాను. కానీ వాడే వినలేదు," అన్నాడు.

"అలాకాదు. దయా ధర్మ భిక్షంగా మనింట్లో వుండమంటే వాడెందుకుంటాడు? మన ఇబ్బందులు చెప్పి సాయంగా రమ్మంటే వచ్చి వుంటాడు," అన్నది వాణి.

బ్రహ్మయ్య సరేనన్నాడు. భీముడికి విషయంతెలియగానే, వాడు తన మకాం బావ ఇంటికి మార్చేశాడు. ఇంటి పెత్తనమంతా తనే తీసుకున్నాడు. ఇంతలో ఒక రోజున గోపయ్య వాళ్ళింటికి వచ్చాడు. భీముడు వాణ్ణి గుమ్మంలో ఆపి, విషయం అడిగాడు. రేపే గృహప్రవేశమనీ, బ్రహ్మయ్యను పిలవడానికి వచ్చాననీ అన్నాడు గోపయ్య.

"బావకు ఒంట్లో బాగోలేదు. నువ్వు చెప్పింది ఆయనకు చెబుతాన్లే. ఇకవెళ్ళు," అన్నాడు భీముడు. గోపయ్య వెళ్ళిపోయాడు.

మర్నాడు బ్రహ్మయ్య వాళ్ళ ఎదురింట్లో గృహప్రవేశం ఆర్భాటంగా జరిగింది. దానికి ఊళ్ళోవాళ్ళుచాలామంది వచ్చారు. బ్రహ్మయ్య ఇంట్లో వాళ్ళెవరూ వెళ్ళలేదు. ఈ సంగతి చాలామంది విడ్డూరంగా చెప్పుకున్నారు. మర్నాడు వీధిలో కనబడితే, ఎరిగినవాడొకడు భీముణ్ణి గృహప్రవేశం గురించి అడిగాడు.

"ఆ గోపయ్య, బావను పిలవలేదు," అన్నాడు భీముడు.

అదేసమయంలో అటుగా వీధిన పోతున్న గోపయ్య ఇది విని, "అబద్ధం! పిలవడానికి మీ ఇంటి కొస్తే, నీ బావకు ఒంట్లో బాగోలే

దన్నావు గదా! నేను చెబుతానని, నన్ను వెళ్ళమన్నావు కూడా," అన్నాడు కోపంగా.

"ఒంట్లో బాగోలేదంటే వెళ్ళి బావను పలకరించి, ఎలా వున్నదని అడుగుతావనుకున్నాను. అలా చెయ్యకపోవడంతో, నువ్వు అంతగా ఆయనకు దగ్గిర వాడివి కాదనుకుని, గృహప్రవేశం సంగతి ఆయనకు చెప్పలేదు. అయినా బావ ఆరోగ్యం మర్నాటికీ బాగుపడలేదు," అన్నాడు భీముడు.

"అయితే, ఆవిషయం గృహప్రవేశం నాడే నువ్వొచ్చి చెబితే, పిలిచినందుకు మర్యాదగా వుండేది," అన్నాడు గోపయ్య నిందను భీముడిపైకి తోస్తూ. భీముడు పెద్దగా నవ్వి, "బావకు చెప్పమన్నావుగానీ, మాట వరసకైనా నన్ను కూడా రమ్మని చెప్పావా? పిలవని చోటుకు నేనెలా వస్తాను?" అన్నాడు.

గోపయ్యకు ఏమనాలో తోచక, తలవంచుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇంటికి తిరిగి వచ్చాక భీముడు, జరిగినదంతా బ్రహ్మయ్యకు చెప్పాడు. బ్రహ్మయ్య కలవరపడి, "ఎందుకురా ఉత్తపుణ్యాన వాడిమీద పగసాధిస్తావు? పాపం చేస్తే, వాడే అష్టకష్టాల పాలవుతాడు," అంటూ బావమరిదిని మందలించాడు.

దానికి భీముడు, "నాకు గోపయ్య మీద పగ దేనికి? అసలు నాకూ వాడికీ ఏమిటి సంబంధం? స్నేహితులను కష్టాల్లో ఆదుకోవాలి. సుఖాల్లో జత కూడాలి. శత్రువుల్ని దూరంగా వుంచాలి. గోపయ్య మనకు మిత్రుడూ కాదు, శత్రువూ కాదు. వాడిని గురించిన ఆలోచనే మనకుండకూడదు. కలుసుకున్నప్పుడు పలకరిస్తాం. సాయమడిగితే చేతనైనది చేస్తాం. ఆ తర్వాత వాడి గురించి పట్టించుకోకూడదు. అదీ తెలివైనవాళ్ళు చేసే పని. నేను అదే చేశాను!" అన్నాడు.

ఇది వినగానే బ్రహ్మయ్యకు తనలోని లోపం తెలిసి వచ్చింది. సాయంచేసిన వాళ్ళందర్నీ తన వాళ్ళనుకుంటూ, వాళ్ళ కష్టసుఖాలలో పాలుపంచుకోవాలని కోరుకోవడం వల్ల, తానెప్పుడూ సంతోషంగా వుండలేకపోతున్నాడు. భీముడు చెప్పిన ప్రకారం చేస్తే, తనకేదిగులూ వుండదు!





# చేపల బావి

అడవిలో జంతువులన్నీ కలిసి కొద్దిమేర దున్ని వ్యవసాయం చెయ్యనిశ్చయించాయి. ఒకనాడు మిగిలిన జంతువులతోబాటు నక్కా కుందేలూ కూడా పారా, పలుగూ పట్టి పని చెయ్యసాగాయి.

సూర్యుడు క్రమంగా పైకెక్కుతున్నాడు. నెత్తి మాడిపోతున్నది.

కుందేలు కొంత సేపటికల్లా ముచ్చె మటలు పట్టి అలిసి పోయింది. కాని పని చాలించి విశ్రాంతి తీసుకుంటే సోమరిపోతని మిగిలిన జంతువులు తిడతాయని భయ పడింది. అట్లాగే పళ్లబిగువున కొంతసేపు కిందామీదా పడుతూ మిగతా జంతువులతో పాటు పనిచేసింది.

కాని మరికొంత సేపటికి కుందేలు పని అయిపోయింది.ఎక్కడైనా చల్లని మాటున విశ్రాంతి తీసుకోకపోతే ప్రాణం పోయేటట్టుగా ఉంది. కొంతసేపు తీవ్రంగా ఆలోచించి, కాలిలో ఏదో ముల్లు గుచ్చుకున్నట్టు బాధ నటించి అది మెల్లగా ఇవతలికి వచ్చేసింది. తరవాత కొంచెంసేపు ఆగి, ఇతర జంతువులు చూడకుండా జాగ్రత్తగాపొదల వెనకగా దౌడు తీసి దూరంగా వున్న తోటబావి దగ్గరికి చేరు కున్నది.

ఆ బావి చెట్టునీడన ఉన్నది. దానికి ఒక గిలకా, గిలకమీదగా పొడవాటి తాడూ, తాడు రెండు చివరలా రెండు బొక్కెనలూ ఉన్నాయి.

ఆ బావీ, నీడా చూడగానే కుందేలుకు ప్రాణం లేచివచ్చినట్టయింది. అది ఒక్క దూకున వెళ్లి బొక్కెనలో పడింది. మరుక్షణమే ఆ బొక్కెన కుందేలు బరువు మూలాన అడుగుకు దిగసాగింది. కుందేలుకు ఒక్క క్షణం కంగారెత్తుకొచ్చింది. కాని ఆతరవాత ఏమయితే అది అవుతుందనుకుని, కుందేలు బొక్కెనలో కదలక మెదలక పడుకున్నది.

నీటిని తాకగానే బొక్కెన నిలిచిపోయింది. కుందేలు కంగారులో అటూ ఇటూ కొట్టు కున్నట్టయితే మునిగిపోయే పనే!

కుందేలు మీద నక్క ఒక కన్ను వేసే ఉంచింది. అందుచేత, ముల్లువిరిగిందని వంక పెట్టి కుందేలు పనిమాని ఇవతలికి రాగానే నక్క అటూ ఇటూ చూసి చల్లగా తనుకూడా జారుకుని కుందేలు వెనకడితే వచ్చింది. కుందేలు బొక్కెనలో దూకి బావి అడుగుకు వెళ్లిపోవటం నక్క అంతదూరం నుంచి చూసింది.

"ఈ కుందేలు ఏదో ఉపయోగం లేనిదే ఈ బావిలోకి దిగి ఇంతసేపు కూచోదు. లోపల ఏదైనా తినే వస్తువు దాచిందేమో!" అనుకుంటూ నక్క మెల్లిగా బావిని సమీపించి లోపలికి తొంగిచూసింది.

బావి చాలా లోతుగా ఉండటంచేత నక్కకు ఏమీ కనిపించలేదు.

"కుందేలు బావా?" అని నక్క పిలిచింది.

"ఎవరదీ? నక్కబావా?" అని లోపలి నుంచి కుందేలు కేకపెట్టింది.

"అక్కడ ఏం చేస్తున్నావేం?" అని నక్క అడిగింది.

"చేపలు పడుతున్నాను, బావా! తెప్పలు తెప్పలుగా వున్నాయి! కావలిస్తే ఆ బొక్కెనలో ఎక్కి నువ్వు కూడా ఇప్పుడే రా?" అన్నది కుందేలు.

పైకి వచ్చివున్న బొక్కెనలోకి నక్క ఒక్క గెంతున దూకింది. కుందేలుకన్న నక్క బరువు కావడంచేత నక్క ఎక్కిన బొక్కెన క్రమంగా కిందికి దిగి, కుందేలు ఎక్కిన బొక్కెన పైకి రాసాగింది.

మధ్య దారిలో రెండు బొక్కెనలూ ఒకదాన్ని ఒకటి దాటేటప్పుడు కుందేలు, "నువ్వు చేపలు పడుతూ ఉండు, బావా! నేనిప్పుడే వస్తాను!" అన్నది.

త్వరలోనే కుందేలు పైకివచ్చి బయటికి దూకి ఇంటిదారి పట్టింది.

ఆరోజు పనిపూర్తిచేసుకుని మిగిలిన జంతువులు మంచినీటి కోసం బావివద్దకు వచ్చి పైకి లాగేదాకా నక్క, పాపం, బావిలోనే ఉండి పోయింది!



'మేరి'
31 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా స్త్రీలు అలంకరించుకుంటున్న ఆకర్షణీయమైన, అందమైన, అసాధారణ మన్నిక గల గోల్డ్ కవరింగ్ ఆభరణాలు

మేరి ఇప్పుడు మిరుమిట్లు గొలిపే రంగులలో, మనోరంజకమైన డిజైన్లలో స్వచ్ఛమైన వెండితో తయారుచేసి, బంగారు పూతపూసి, అమెరికన్ డైమండ్లు (A.D.) అమర్చిన ఆభరణాలను పరిచయం చేస్తోంది.

వి.పి.పి. ద్వారా ఆభరణాలు తెప్పించుకోవచ్చు. ఏవి ఆభరణాలు కావాలో పేర్కొంటూ మాకు వ్రాయండి. భరతనాట్య కళాకారులకు, దేవాలయ విగ్రహాలకు ఆభరణాలు మా ప్రత్యేకత. ఉచిత రంగుల క్యాటలాగ్ కోసం వ్రాయండి. ఉత్తర ప్రత్యుత్తరాలు హిందీ లేదా ఇంగ్లీష్‌లో మాత్రమే వ్రాయవలెను.

No:185 Rs. 400/50

No:177 Rs. 200/50

No:27 Rs. 200/50

No:146 Rs. 200/50

No:145 Rs. 200/50

No:197 Rs. 400/50

No:3 Rs. 200/50

No:43 Rs. 150/50

No:114 Rs. 200/50

No:268 Rs. 600/50

No:223 Rs. 600/50

No:231 Rs. 300/50

No:74 Rs. 600/50

No:90 Rs. 400/50

A. D.
No:834 Rs. 450/50

No:82 Rs. 400/50

A. D.
No:901 Rs. 350/50

A. D.
No:828
Rs.
1550/50

A. D.
No:907 Rs. 300/50

A. D.
No:867 Rs. 500/50

**MERI GOLD COVERING WORKS**
P.O. Box 1405, 18, Ranganathan Street, T. Nagar,
Madras 600 017, Phone: 444671, 442513

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



Taji Prasad



Taji Prasad

✱పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ మే నెల15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **పేకమేడలు కడితే ఎలా?** రెండవ ఫోటో : **భవితకు పునాది వేయాలి ఇలా!**

పంపినవారు : ఎం. ఛాయాదేవి, ఇండియన్ బ్యాంకు,
న్యూ నల్లకుంట, హైదరాబాదు - 500 044.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ




వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

అస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 117.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 264.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 123.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 264.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# 10 తేడాలు చెప్పండి





జవాబులు :

1. పువ్వులో రేకులు ఎక్కువ ఉన్నాయి.
2. చిలక నోరు తెరుచుకుని ఉంది.
3. చిలక మెడ చుట్టూ ఎర్రటి పట్టీ ఉంది.
4. అమ్మాయి కళ్ళు తెరిచి ఉన్నాయి.
5. అమ్మాయి నవ్వుతూ ఉంది.
6. ఫ్రాక్ పైన నక్షత్రాలు ముద్రించి ఉన్నాయి.
7. అమ్మాయి గాజు వజ్రాలతో పొదిగి ఉంది.
8. కుక్క నాలుక బయటకు వేలాడుతోంది.
9. ప్లేట్ మీద పార్లే యొక్క పేరు వ్రాయబడి ఉంది.
10. ప్లేటులో మేంగో బైట్లు ఉంచబడ్డాయి.